7-8-1992 శుక్రవారం 19 పేజీలు సంపుటి : 63 సంచిక :32 విడిప్రతి : రు. 2.00 లు

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు

## పత్రికా రచయిత కావాలి

'జమీన్‌రైతు'లో పనిచేయుటకు ఒక విహారు విలేఖరుడు కావలెను. వార్తా సేకరణ, వ్యాఖ్యానము గలిగిన అనుభవం వున్నవారైతే మంచిది. అభిరుచి, శ్రద్ధాసక్తులు కలిగిన విద్యావంతులైన వారెవరైనా దరఖాస్తు చేసుకోవచ్చు. నెల్లూరు జిల్లా వారికి ప్రాధాన్యత వుంటుంది. అర్హతను బట్టి మంచి వేతనం.

జమీన్‌రైతు, సంపాదకుడు,
నెల్లూరు- 524 001;
ఫోన్:27354.

తొలగింపు?

డాక్టర్ డిఎల్ రవీంద్ర రెడ్డి
సంగీతం వెంకట రెడ్డి,
డి. శ్రీనివాస్!

# మంత్రి మండలిలో ఈ వారమే మార్పులు?

కొత్తముఖాలు?

పసల
ఆలపాటి,
పి సుధీర్,
షబ్బీర్ ఆలి,
జోగయ్య

వినాయకుడి పెళ్లి మాదిరి వాయిదా పడుతూ వస్తున్న రాష్ట్ర మంత్రి వర్గ విస్తరణ ఈ వారంలో జరిగి పోవచ్చని ఒక వదంతి. ఇప్పటికి ఇటువంటి వారాలు ఏ పదికిపైనో గడిచిపోయాయి. ఎప్పటికప్పుడు మంత్రివర్గ విస్తరణ జరిగి పోయినట్లే కన్పిస్తున్నది కాని, జరగడం లేదు. ముఖ్యమంత్రి మొన్న ఢిల్లీకి పోయినప్పుడు కూడా ఈ విషయం ప్రధానితో ప్రస్తావించడానికి ప్రయత్నించారు. కాని వీలు కాలేదు. పది నిముషాలకు పైన మాట్లాడడానికి కుదర లేదట. తిరిగి రేపు ఉదయం (8తేది)ఢిల్లీ వెళ్లనున్నారు. ఈ పర్యటనలో ఏ సంగతీ తేల్చుకునే వస్తారని చెప్తున్నారు.

17 నుంచి కాని 19 నుంచి కాని రాష్ట్ర శాసనసభా సమావేశాలు ప్రారంభం కానున్నాయి. అసెంబ్లీ మొదలయ్యేలోగా మంత్రివర్గ విస్తరణ చేస్తానని ముఖ్యమంత్రి చెప్పి వున్నారు. ఆ మాట నిలబెట్టుకోవడం కోసం కాకపోయినా, సభలో తగిన సైన్యాన్ని సమాయత్తం చేయడానికైనా విస్తరణ జరిగి తీరాలి. అసమ్మతి ఉధృతి ఫలితంగా ఈసారి శాసనసభా సమావేశాలు వేడివేడిగా వుండబోతాయి. మెడికల్ కాలేజీల సమస్య వుండనే వుంది. పలు అవినీతి ఆరోపణలపైన చర్చ జరుగుతుంది. విమర్శలు సహజంగానే ఈసారి ముఖ్యమంత్రిపై కేంద్రీకరింప బడతాయి. వీటిని ప్రతిఘటించ డానికి, ప్రతి జవాబు ఇవ్వడానికి తగిన ఏర్పాట్లు చేయాలి. శాసన సభ్యుల నుంచి మద్దతు పొందాలి. వారు చర్చలలో పాల్గొనేట్టు చేయాలి. అసమ్మతి, సమ్మతీయుల పట్ల ముఖ్యమంత్రి ప్రవర్తనలో స్పష్టమైన తేడా అంటూ వస్తేగాని అది సాధ్యం కాదు. అందర్నీ ఒకే దృష్టితో చూస్తే – ఇక ఎవరు మాత్రం ఉత్సాహంగా విమర్శలను ఎదుర్కొంటారు. అందువల్లే అసెంబ్లీ లోగా మంత్రివర్గ విస్తరణ చేయడం జరుగుతుందని అంచనా.

పిఎం అంగీకరిస్తే ముగ్గుర్ని తొలగించి, ఏడెనిమిది మందిని చేర్చుకుంటారని చెప్తున్నారు. ఉద్వాసన జాబితాలో రెవిన్యూ మంత్రి శ్రీ డిఎల్‌రవీంద్ర రెడ్డి, శ్రీ సంగీతం వెంకట రెడ్డి, శ్రీ డి. శ్రీనివాస్‌ల పేర్లు ప్రముఖంగా విన్పిస్తున్నాయి. రవీంద్ర రెడ్డి, వెంకట రెడ్డిలిద్దరికీ ముఖ్యమంత్రితో మాటలు లేవు. శత్రువుల మాదిరి వ్యవహరిస్తున్నారు. చెన్నారెడ్డి పిలుపునందుకొని పరుగులు పెట్టే వెంగారెడ్డి, రోశయ్యలు మాత్రం సర్దుకపోయినట్లున్నారు. అదీగాక, రాజకీయ వ్యూహం ప్రకారం రాజశేఖర రెడ్డి అనుచరులను మాత్రమే దెబ్బకొడ్తారని అంచనా. ఆ దృష్టితో చూసినపుడు డి. శ్రీనివాస్ తొలగింపు నుంచి మినహాయింప బడవచ్చు.

కొత్తగ గా మంత్రులయ్యేవారిలో శ్రీ పసల పెంచలయ్య, శ్రీ ఆలపాటి ధర్మారావు, శ్రీ షబ్బీర్ ఆలీ, శ్రీ పి. సుధీర్ కుమార్ పేర్లు విన్పడుతున్నాయి. సుధీర్ విషయంలో ప్రధాని సమ్మతి అవసరం. ఎందువల్లనో ప్రధానికి, శివశంకర్‌కు మధ్య సత్సంబంధాలు లేవు. కాపునాయకులలో శ్రీ సంగీతం వెంకటరెడ్డిని తొలగిస్తారు కాబట్టి, హరిరామజోగయ్యకు అవకాశం ఇవ్వవచ్చునని పరిశీలకుల భావన.

8 తేది పిఎమ్‌ని కలిసి వచ్చిన తర్వాత, ఒకటి రెండు రోజులలోనే మంత్రి వర్గ విస్తరణ విషయమై నిర్ణయంలు జరిగిపోతుంది. ఇప్పుడు మార్పులు జరగకుంటే మళ్లీ సెప్టెంబరు నెలాఖరు వరకు ఆ ప్రస్తావనే రాదు.

ప్రధానమంత్రి విశాఖ సభలో అసమ్మతి నాయకులకు చురకలు వేస్తూ మాట్లాడి వెళ్లిన తర్వాత ముఖ్యమంత్రి వర్గీయులు చాలా సంతోషంగా వున్నారు. ఇప్పట్లో, నాయకత్వ మార్పు ఆలోచనే లేదన్న వాస్తవాన్ని ప్రధాని ఆ రూపంలో ప్రకటించి వెళ్ళారని వారు భావిస్తున్నారు. ఆ ధైర్యమే విస్తృత స్థాయిలో మంత్రివర్గ మార్పులకు ప్రేరణ అనుకోవచ్చు.

## ఇంజనీరింగ్ కాలేజీలు అనుమానమే!

# మెడికల్ కాలేజీలు మూడైనా మిగుల్తాయా?

సుప్రీంకోర్టు తీర్పు, మెడికల్ కాలేజీల పాలిట యమపాశమై పోయింది. హైకోర్టులోనూ పలుకేసులు దాఖలైనాయి. 12తేదీ ఈ కేసులన్నీ ఫుల్‌బెంచ్ ముందు విచారణకు వస్తున్నాయి. అర్జీషన్లపై ఇప్పటికే హై కోర్టు స్టే ఇచ్చింది. దాన్ని కొనసాగించేది, లేనిదీ 12 తేది తేలిపోతుంది. అయితే క్యాపిటేషన్ ఫీజుపై దేశంలోని అత్యున్నత న్యాయస్థానం అంత స్పష్టంగా తీర్పు చెప్పిన తర్వాత, కాలేజీలలో ఎనేషన్లు ప్రాథమిక హక్కులకే భంగకరమని వ్యాఖ్యానించిన తర్వాత ఇక ఆ విధానంలో వృత్తి విద్యాకళాశాలలను నడపజూడడం రాజ్యాంగ బద్ధం కాదని న్యాయ నిపుణుల భావన. హై కోర్టులలోని కేసులు ఏ మలుపు తిరిగినా, సుప్రీంకోర్టు వరకు విషయం వెళితే, అంతిమ నిర్ణయం అటే వుంటుంది తప్ప వేరు కాదు.

ఈ పరిస్థితి గమనించే రాష్ట్ర ప్రభుత్వం ఇంజనీరింగ్ కళాశాలల మంజూరు ఉత్తర్వును ప్రక్కన పెట్టింది. 12 తేది హై కోర్టు తీర్పును బట్టి వాటిపై నిర్ణయం జరగాలి. తీర్పు ఏదైనా ఆ కాలేజీలు ఇక అనుమానమే. దరఖాస్తు చేసిన వారిలోనూ ఇక పెద్ద ఉత్సాహం కన్పించక పోవచ్చు.

ఇప్పటికే మంజూరైన 12 మెడికల్ కాలేజీల పరిస్థితి సందేహమే! క్యాపిటేషన్ ఫీజు దండకుండా కాలేజీలు నిర్వహించేందుకు ఎందరు ముందుకు వస్తారు. పరువుకు భయపడి మాత్రమే నడపాలి. అప్పుడు వెనక్కు తగ్గితే, కేవలం కాలేజీల రూపంలో వ్యాపారం చేయడానికి ప్రయత్నించారన్న నింద పైన పడుతుంది. దానికి వెరచి ముందుకు

కొరవ 6 పేజీలో

# పదవీ వైరాగ్యమే గోపాలరెడ్డి గొప్పదనం

ఆర్.యల్.రెడ్డి ట్రస్టుకమిటీ యాజమాన్యంలో టౌన్‌హాలులో ఈనెల 4 తేది స్వర్గీయ రేబాల లక్ష్మీనరసారెడ్డి 79 జయంతి జరిగింది.

7గంటల నుండి 7-30 వరకు శ్రీమతి యం.విద్యుల్లత గారి శాస్త్రీయ సంగీత గానం. ట్రస్టు కమిటీ సభ్యుడు శ్రీ జి.వి.రెడ్డి సభకు స్వాగతం పలికారు.

ఆంధ్రప్రదేశ్ హైకోర్టు, మాజీ ప్రధాన న్యాయమూర్తి, మాజీ లోకాయుక్త శ్రీ ఆవుల సాంబశివరావు గారు సభను ఎంతో హుందాగా నిర్వహించారు. ఆయన చేసిన అధ్యక్షోపన్యాసంలో ఎక్కడా అతిశయోక్తులు, శ్రుతిమీరిన పొగడ్తలూ లేవు.

దివంగత శ్రీ ఆర్.ఎల్.రెడ్డి గురించి మాట్లాడుతూ, చనిపోయిన వారిని ఆనవాయితీగా కీర్తిశేషులంటారనీ; కానీ భూరిదానాలతో, ప్రజోపయుక్తమైన దానాలతో శ్రీ ఆర్.యల్.రెడ్డి శాశ్వత కీర్తిని సంపాదించి నిజమైన కీర్తిశేషుడయ్యారని శ్రీ ఆవుల సాంబశివరావు ప్రశంసించారు. చిన్న పిల్లల ఆస్పత్రికి, జిల్లా కేంద్ర గ్రంథాలయాలకు ఆయన దానం చేసిన భవనాలు ఆయన కీర్తికి చిహ్నాలుగా నిలుస్తాయని శ్రీ ఆవుల శ్లాఘించారు. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారిని ప్రస్తావిస్తూ, గోపాలరెడ్డిలోని గొప్పదనం పదవీ వైరాగ్యమని ఆవుల కొనియాడారు. వయసు పైబడుతున్నా, మితిమీరిన ముదిమిలో సైతం పదవులు కావాలని వెంపర్లాడుతున్న వారెందరో ఉండగా, పదవులకూ, బిరుదులకూ ప్రాకులాడక, నిష్కళంక, నిరాడంబర జీవితాన్ని ఎన్నుకొని, రాజకీయాలకు దూరంగా, కళా సాహిత్యరంగాలకు అత్యంత సన్నిహితంగా తన జీవితాన్ని మలచుకోవడం ఆయన గొప్పతనమని అన్నారు ఆవుల వారు.

గోపాలరెడ్డిగారు ఎందరెందరికో సన్మానాలు చేశారనీ, చేయించారనీ, తాను మాత్రం సన్మానాలకు దూరంగానే ఉండిపోయారనీ, అలాటి గోపాలరెడ్డి గారిని సన్మానానికి అంగీకరింపజేసి, ఆర్.ఎల్.రెడ్డి ట్రస్టు సభ్యులు ఘన విజయమే సాధించారంటూ అభినందించారు.

ఆర్.ఎల్.రెడ్డి ట్రస్టు డాక్టర్ గోపాలరెడ్డి గారిని సన్మానించింది.

**ఆరెల్‌రెడ్డి జయంతి సన్మానంలో ఆవుల ప్రశంస**

తరువాత పురప్రముఖులు, విద్యార్థినులు, మరికొన్ని సాంస్కృతిక, సాహిత్య సంస్థలు గోపాలరెడ్డి గారిని పుష్ప మాలాంకృతుల్ని చేశాయి. ఆ తరువాత సభాధ్యక్షులు ఆవుల సాంబశివరావు గారికీ, ఉపన్యాసకులుగా విచ్చేసిన హైదరాబాదులోని సెంట్రల్ యూనివర్శిటీ డీన్ ఆచార్య శ్రీ జి.వి.సుబ్రహ్మణ్యం గారికీ నూతన వస్త్రా_లు బహూకరించి, సన్మానించారు.

ఈ సన్మానాల తరువాత ఆచార్య జి.వి సుబ్రహ్మణ్యంగారు డా. బెజవాడ గోపాల రెడ్డిగారి రచనల ఆధారంగా గోపాల రెడ్డిగారి సాహిత్య మూర్తిమత్వాన్ని, ఆయన సాహిత్య వ్యక్తిత్వాన్ని విశ్లేషిస్తూ ప్రసంగించారు. గోపాలరెడ్డి గారి సాహితీ వ్యక్తిత్వం మన జాతీయ త్రివర్ణ పతాకం వంటిదని అభివర్ణించారాయన. త్యాగమయమైన గాంధీజీ జీవితం కాషాయ వర్ణానికీ; నెహ్రూ విజ్ఞాన దృక్పథం, చారిత్రక అవగాహన ఆకుపచ్చ రంగుకీ; రవీంద్రుని తాత్విక, కళాసాహిత్య జీవిత చంద్రిక తెలుపు రంగుకీ ప్రతీకలుగా నిలిస్తే- ఆ మూడు జీవితాల సారాన్ని తన జీవితంతో సమ్మిళితం చేసుకున్న మహత్తర జీవితం గోపాలరెడ్డి గారిదని విశ్లేషించారు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం. ఆ తర్వాత బెజవాడ గోపాలరెడ్డిగారు తన ప్రతి స్పందనను పది నిముషాలలో ముగించారు.

నేను ఈ శతాబ్దపు పూజారిని. ఎన్నో మహత్తర సంఘటనలకు, మానవుని విజయాలకు సాక్షిని. రేపటితో నాకు 85

కొరవ 6 పేజిలో

## నెల్లూరు జిల్లా పాలఉత్పత్తిదారుల సహకార యూనియన్ లిమిటెడ్, నెల్లూరు

Letter No. 680/E2/91 dt. 1.8.92

### టెండరు నోటీసు

ఈ దిగువ మార్గములో పాలు రవాణా చేయుటకు లారీలు, వ్యానులు గల యజమానుల నుండి సీలు వేసిన టెండర్లు కోరబడుచున్నవి.

| వరుస. నెం. | రూటుపేరు | సుమారు దూరము రోజుకు 10% ఎక్కువ మరియు తక్కువ కూడా వుండవచ్చును. | కెపాసిటి | కాలపరిమితి |
|---|---|---|---|---|
| 1. | నెల్లూరు - కండలేరు సవరించిన రూటు | 134 కి.మీ | 9 టన్నులు | రెండు సం.లు |
| 2. | నెల్లూరు - కోడూరు సవరించిన రూటు | 142 కి.మీ | 6 టన్నులు | రెండు సం.లు |
| 3. | వరగలి - వెంకటగిరి అక్టోబరు నుండి ఏప్రిల్ వరకు మే నుండి సెప్టెంబరు వరకు | 170 కి.మీ 90 కి.మీ | 9 టన్నులు | రెండు సం.లు |
| 4. | కావలి -BKఅగ్రహారం | 87 కి.మీ | 3 టన్నులు | రెండు సం.లు |
| 5. | రితి పేట - ఉదయగిరి | 88 కి.మీ | 3 టన్నులు | ఆరు మాసములు |
| 6. | పెద్దిరెడ్డిపల్లి - కావలి వయా ఉదయగిరి | 206 కి.మీ | 9 టన్నులు | ఆరు మాసములు |
| 7. | పామూరు - కావలి వయా దుత్తలూరు | 237 కి.మీ | 9 టన్నులు | ఆరు మాసములు |
| 8. | జిల్లాలో అన్ని పాలకేంద్రములు తిరుగవలసి ఉన్నది | 2500 కి.మీ తగ్గకుండా ఉంటుంది | జీపు | రెండు సం.లు |

1. టెండరు ఫారాలు ధర రూ. 21.45 చెల్లించి జనరల్ మేనేజరు NDCMPU Ltd, నెల్లూరు వారి కార్యాలయము నుండి 19.8.92 మధ్యాహ్నం 1.00 గంట వరకు షెడ్యూలు పొందవచ్చును. సీలు వేసిన టెండర్లు అదే రోజు 3.00 గంటల వరకు స్వీకరించి 4.00 గంటలకు టెండరు కమిటీ వారి సమక్షమున టెండర్లు తెరువబడును.
2. టెండరులో పాల్గొనువారు పూర్తి కండిషను కలిగిన లారీలు,వ్యానులు జీపు మాత్రమే ఉపయోగించవలెను.
3. ఇతర వివరములకు కార్యాలయము పనిచేయువేళలో అడిగి తెలుసుకొనవచ్చును.
4. టెండరులో పాల్గొనువారు ధరావత్తు సొమ్ము 1,3,6,7 రూటువారు రూ. 5,000/- చొప్పున మరియు 2,4,5,8రూటువారు రూ. 2,000/- ఎప్పున EMD జనరల్ మేనేజరు, NDCMPU Ltd, నెల్లూరు వారిపేరుతో DD/Pay Order తీసుకొనవలయును, షెడ్యూలుతో పాటు జతపరచవలయును. షెడ్యూలుతో పాటు DD/Pay Order జతపరచని ఎడల స్వీకరించబడదు

**జనరల్ మేనేజరు,**

యన్.డి.సి.యం.పి.యు. లిమిటెడ్, నెల్లూరు.

## పినాకిని తీరం

### బలమా? ప్రతిష్టా?

ఇదివరకొక పర్యాయం కూడా ఈ శీర్షికలోనే ప్రస్తావించాను - కాంగ్రెసు - ఎన్.యస్.యు.ఐ.ల మధ్య త్రిశంకుస్వర్గం వలె యూత్ కాంగ్రెస్ అనేది ఒకటి వుండడం అవసరమా? దానివల్ల పార్టీకి బలం ఏమైనా చేకూరుతున్నదా? యువకులను పార్టీ వైపుకు ఆకర్షించడానికి యూత్ కాంగ్రెస్ ప్రత్యేకంగా ఏమైనా కృషి చేస్తున్నదా? పార్టీ ప్రతిష్టను ఏమైనా ఇనుమడింప జేస్తున్నదా? ఈ ప్రశ్నలకు యువకులు, అందులోనూ కాంగ్రెస్ పట్ల అభిమానం గల యువకులే సమాధానం చెప్పడం సమంజసంగా వుంటుంది. కాలంలో తరంలో మాకు, నేటి యువతరానికి మధ్య ఎంతో అంతర ముంది, నా ఆలోచనలు, అభిప్రాయాలు బూజుపట్టినవి కాక పోయినా, నేటి పోకడలకు అనుగుణమైనవి కాక పోవచ్చు; రుచించక పోవచ్చు. అందువల్లనే పైసందేహాలకు యువకులే సమాధానం చెప్పడం సముచితంగా వుంటుందని నేననడం!

కాంగ్రెస్‌లో ఎన్ని ముఠా లున్నాయో యూత్‌కాంగ్రెస్‌లో అన్ని వున్నాయి; వ్యక్తిగతంగా కాంగ్రెస్ వాదుల మధ్య ద్వేషాసూయలు ఎంత ఎక్కువగా వున్నాయో వీరి మధ్య ఎత్తుకుంటూనే తొంగి చూస్తున్నాయి. కాంగ్రెస్ నాయకులలో అవకాశవాదం ఎట్లా వుందో వీరిలోనూ అంతకంటే అధికంగానే వుంది; కాంగ్రెస్ నాయకులలో అవినీతి, అధికార దుర్వినియోగం ఎంత ప్రబలి పోయి వుందో, వీరిలోనూ అంతగానే వుంది; నిత్యపాలనలో జోక్యం, అడుగడుగునా అధికార్ల విధి నిర్వహణకు అడ్డుపడడం వంటి కాంగ్రెస్ వాదులలో వ్యాపించి వున్న జాడ్యాలు వీరిలోనూ ప్రకోపించి వున్నాయి; బెదిరించి పనులు చేసుకోవడం, ప్రలోభ పరచి ధనార్జన చేయడం వారిలో వలె వీరిలోనూ వెన్నతో పెట్టిన విద్యగా వుంది; కాంగ్రెస్ నాయకుల కీలు బొమ్మలుగా, వారి దబ్బుతో ఎట్లాడమంటే అట్లా ఆడటం, ఏమి చేయమంటే అట్లా చేయడం వారి కార్యకలాపాలై పోయాయి; అన్నిటికీ మించి రౌడీజమే వారి నైజంగా, అఘాయిత్యమే వారి నిత్యనైమిత్తిక కార్యక్రమంగా వుంటున్నది. యూత్ కాంగ్రెసీయుల తీరుతెన్నులు చూస్తుంటే హతవిధీ అనిపిస్తుంది.

ఈ పరిస్థితి ఏ ఒక్క ప్రదేశానికి, జిల్లాకు పరిమితమైంది కాదు; అన్ని చోట్ల, అన్ని స్థాయిలలో ఇదే దౌర్భాగ్య స్థితి! నెల్లూరు జిల్లా విషయమే తీసుకోండి - యూత్ కాంగ్రెస్‌లో ఎన్ని గ్రూపులు, ఎన్ని పోకడలు, ఎన్ని భిన్నమార్గాలు, ఎన్ని విధానాలైనా కార్యకలాపాలు, ఎన్ని గూడు పుఠాణీలు, ఎంత ద్వేషాసూయలు... చెప్పలేము. దినపత్రికలు ఈ రాజకీయాలకు అద్దం పడుతుంటాయి; వారికి బహుళ ప్రచారం చేసి పెడుతుంటాయి; వారిని మహా నాయకులను, గొప్పవీరులను చేసి వేస్తుంటాయి. నాయకుల ప్రాపు ఒక్కవైపైతే, పత్రికల ప్రచారం మరోవైపు... వీటితో వారికి పట్ట పగ్గాలు లేకుండా పోతున్నాయి. పెద్దలేదు చిన్నలేదు, మంచి లేదు చెడులేదు, వుచితానుచితాలు అసలే లేవు. వారి ఆగడాలకు ఆకతాయి తనాలకు అంతమే లేదు. స్థానిక నాయకుల మధ్యనే కాదు, రాష్ట్ర కాంగ్రెస్ నలుగురు మధ్య వీరూ చీలిపోయి వున్నారు. వారి రాజకీయాలే వీరి రాజకీయాలు గాని, యువకులను సంఘటిత పరచడం, వారిని చైతన్య వంతులను చేయడం, నిర్మాణాత్మక మార్గంలో వారిని నడపడం, భావి రాజకీయ నాయకత్వానికి వారిని అర్హులను చేసే కృషి లేనే లేదు. కృషే కాదు, అటువంటి ఆలోచన, తలంపు, వూనిక లేనే లేవు. ఒక విధంగా చెప్పాలంటే పెద్దవారి వలెనే యువకులకూ రాజకీయాలే వృత్తి అయిపోయింది; ఆదాయ వనరులు, బ్రతుకు తెరువులు, పదవుల సంపాదనకు రాజ మార్గాలు అయి పోయాయి. నేటి యువకులలో యోగ్యత అనే గుణాన్ని వెతికి చూడడానికి దుర్భిణీలు పనికిరావు. ఎక్కడ ఏ మూలైనా ఆ అంశం వలుసంతైనా వుంటే గదా కనపడడానికి!

యూత్ కాంగ్రెస్ అనేది కాంగ్రెస్‌కు ఒక గుదిబండ; కాంగ్రెస్ అభిమానులైన యువకులను పెడమార్గాన పెట్టే ఒక శిక్షణ శాల; భవిష్యత్తులో కాంగ్రెస్‌ను మరీ దుర్గంధ భూయిష్టం గావించబోయే ఒక మహాసంస్థ. ఇటువంటి విభాగం వుండే దానికంటే, అది రద్దుగావడమే కాంగ్రెస్‌కు, దేశానికి మేలు. కాంగ్రెస్ పట్ల అభిమానమున్న యువకులు కాంగ్రెస్‌లోనే చేరవచ్చు; మధ్యలో మరో పార్టీ అనవసరం. పద్దెనిమిదేళ్ల వాడు ఓటు చేయడానికి అర్హుడవు తున్నప్పుడు, కాంగ్రెస్‌లో వుండడానికి ఎందుకు అర్హుడు కాడు? పదవుల పంపకంలో యువకుల ప్రాతినిధ్యానికి ప్రత్యేకంగా యూత్ కాంగ్రెస్ ఎందుకు - కాంగ్రెస్ లోనే యువకులకు అవకాశం కల్గించుకుంటే

కొరవ 6 పేజిలో

# జమీన్‌రైతు

## రైలు ప్రమాదాలు

రాష్ట్రంలో రైలు ప్రమాదాల సంఖ్య రాను రాను పెరిగిపోతూంది. ప్రతివారం ఏదోఒక చోట, ఏదో ఒక రైలు, ప్రమాదానికి గురౌతున్నది. ప్యాసింజరు రైళ్లయితే పత్రికలకెక్కుతున్నాయి; గూడ్సురైళ్లుతెలియకుండానే క్రిందపడి, పైన పడి సర్దుక పోతున్నాయి. గత రెండు సంవత్సరాలలో జరిగిన రైలు ప్రమాదాలు ఎన్నో లెక్కలేదు. ఇటీవలనే కావలి, చుండూరు, నిడుబ్రోలు దగ్గర జరిగిన ఘోర ప్రమాదాలు మన కళ్లముందు కదలాడుతూనే వున్నాయి. వాటిలో ప్రాణాలు పోగొట్టుకున్న అమాయక ప్రయాణీకుల ఆక్రందనలు విన్పడుతూనే వున్నాయి. అప్పుడే మరొక సారి తాడేపల్లి గూడెం దగ్గర గోదావరి ఎక్స్‌ప్రెస్ పట్టాలు తప్పింది. పైనున్న ఏ దేముడో కరుణించ బట్టి సరిపోయింది కాని, ఆ ప్రమాదం జరిగిన తీరుకు పెద్ద సంఖ్యలో ప్రాణహాని జరిగి వుండవలసింది. ప్రయాణీకులతో నిండుగా వున్న 9 బోగీలు పట్టాలు తప్పి, రైలు కట్ట కూడా దాటి, పొలాల గట్ల మీద బోల్తా కొట్టాయి. కొన్ని కాలువలోకి జారాయి. అదృష్టమే ప్రయాణీకుల ప్రాణాలు కాపాడింది.

విశాఖ -రాజమండ్రిల మధ్య ఇట్లా రైలు ప్రమాదం జరగడం ఆనవాయితీ అయిపోయింది.ఇవి ఎవరి విద్రోహం వల్లనో, తప్పిదం వల్లనో జరుగుతున్నవి కావు; పట్టాలు త్రుప్పుపట్టి, జాయింట్‌లు వూడిపోయి, రైళ్లు జారిపోవడం తప్ప వేరు కాదు. మరొక పదేళ్లు ఈ లైను పనిచేసి తీరు తుందని రైల్వే అధికారులు చెప్తున్నా, ఆ లైనుకు హైస్పీడు రైళ్లను భరించే శక్తిలేదని ఈ ప్రమాదాలు రుజావు చేస్తున్నాయి. అసలు రైలు పట్టాల నిర్వహణలోనే అధికారులకు శ్రద్ధ లోపించిందా అన్న సందేహం కల్గుతున్నది. త్రుప్పుపట్టిన పట్టాల భాగాలను, వదులౌతున్న జాయింట్లను, పట్టు తప్పుతున్న ఫిష్‌ప్లేట్‌ను ఎప్పటికప్పుడు గుర్తించి సరిచేయడం జరుగుతుంటే ఇన్ని ప్రమాదాలు జరుగుతాయా? ప్రతి ప్రమాదాన్నీ డ్రైవరు తప్పు అనో, నక్సలైట్ల విద్రోహమనో, టెర్రరిస్టుల కుట్ర అనో తప్పించుకో చూడకుండా, రైల్వే లైన్ల నిర్వహణను మెరుగు పరచడం అవసరం. ప్రయాణీకుల ప్రాణాలకంటె రైల్వే శాఖకు మరేదీ ముఖ్యం కాదు - కారాదు.

## ఒలింపిక్ ఓటమి

ఒలింపిక్ క్రీడోత్సవాలలో భారత క్రీడాకారులు ఘోరంగా విఫలమయ్యారు. పతకాల జాబితాలో అట్టడుగు స్థానం కూడా సంపాదించలేక, పరాభవంతో తిరుగు ముఖం పట్టారు. ప్రపంచ స్థాయి ఆటలలో పాలుపంచుకునే నైపుణ్యం, ప్రతిభ, శిక్షణ మన క్రీడాకారులకు ఏ మాత్రం లేవని స్పష్టంగా రుజావై పోయింది.

పతకం సాధించుకుని వస్తారనుకున్న విలువిద్యాకారుడు లింబారామ్, కుస్తీ వస్తాదు సుభాష్ శర్మ, టెన్నిస్ క్రీడాకారులు రమేష్ కృష్ణన్, లియాండర్ పేస్, ఆ క్లైట్ బహదూర్ సింగ్ తదితరులంతా సగంలోనే ఓటమి పాలై, ఇంటి దారి పట్టారు. మరీ దారుణ పరాభవం హాకీ జట్టుది. ఐరోపా పర్యటనలో ఇంగ్లండ్‌ను ఓడించి, గతించిన ప్రాభవాన్నితిరిగి నిలబెట్టగలదను కున్న భారత జట్టు కనీసం ఐదో స్థానాన్ని కూడా నిలబెట్టుకోలేక, సిగ్గు చేటైన పరిస్థితిలో పడిపోయింది. బార్సిలోనా ఒలింపిక్స్ భారతదేశ క్రీడా నైపుణ్యానికి చేదు గుర్తుగా మిగిలిపోయాయి.

క్రీడాకారుల వైఫల్యానికి ప్రభుత్వానిదే ప్రధాన బాధ్యత. ఆసియా ఆటల పోటీల తర్వాత ఈ రంగంలో కొంత ఉత్సాహం ప్రదర్శించి నప్పటికీ, ఆ తర్వాత మళ్లీ మామూలు ధోరణిలో పడిపోయింది ప్రభుత్వం. క్రీడా మండలులు, సవాలక్ష క్రీడా సంఘాలు రాజకీయ పునరావాస కేంద్రాలుగా మారిపోయాయి. క్రికెట్ పై మోజు తక్కిన ఆటలను నిర్లక్ష్యం చేసేస్తున్నది.

భారతదేశంలో నైపుణ్యం కల్గిన క్రీడాకారులు లేకుండా పోలేదు. కాని రాజకీయపరమైన సిఫార్సులు గల్గిన వారు మాత్రమే క్రీడా శిక్షణ పొందగల్గుతున్నారు; పోటీలకు ఎంపిక కాగల్గుతున్నారు. ఆధునిక పద్ధతులలో, పరికరాలతో శిక్షణ నిచ్చే వసతులు, కోచ్‌లు, గైడులు మనకు లేరు. కేంద్ర ప్రభుత్వం ఇప్పటికైనా క్రీడా విధానంపై పునరాలోచన జరిపి, దేశంలో క్రీడాభిమానాన్ని, నైపుణ్యం కల్గిన క్రీడాకారులను పెంచడానికి కృషి జరపాలి. కనీసం పై ఒలింపిక్స్ నాటికైనా భారతదేశం పేరును పతకాల జాబితాలో చేర్చాలి!

---

## జమీన్‌రైతు

8 పేజీలు అణా
7-8-42.

### భాగ్యవంతులకు గాంధీజీ హితవు

సంస్థానాధీశులు, జమీందార్లు, పత్రిక శిఖామణులు మున్నగు భాగ్యవంతులకు గాంధీజీ చక్కని సలహా యిచ్చారు. పోలీస్ శక్తి ఎల్లకాలం వీరి నిరంకుశత్వాన్ని, భాగ్యాన్ని కాపాడలేదు. ప్రజలు మేల్కొంటున్నారు; కళ్లు తెరిస్తే ఈ పెద్దలకు ఏమీ దక్కదు చివరకు. అందుకని ధర్మకర్తలుగా ప్రవర్తించండి. లేక కనీసం అధికారాన్ని, భాగ్యాన్ని ప్రజలతో పంచుకోరాదా అని గాంధీజీ వారికి హితవునిచ్చినారు.

ఓ పిచ్చి గాంధీ! ఇంకా నీకు ఆశలున్నాయా ఈ విషయంలో ? చరిత్ర, నీ గంపెడు అనుభవం, మానవ నైజం, జీవిత సత్యాన్ని వేయినోళ్ల చాటుతున్నదే? దానికంతా మరొక గాలిదుమారం రావాలె.

### నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

పబ్లికు ప్రాసిక్యూటరు పదవి వార్ని వూరించి, వీర్ని వూరించి చివరకు వద్వేటి విశ్వనాథరావు రావుసాహెబ్‌ల వారిమీదనే వాలింది. అబ్బా! కొన్ని వేల సంవత్సరాలుగా జేసిన తపస్సు నేటికి ఫలించిందిరా దేముడా!

యుద్ధానికి లవలేశం గూడా పనిజేసి ఎరుగని యువకులంతా పొట్టతరువుకోవడం స్వేధాశ్రమగాక మరేంవుంటుంది చెప్పండి?

గవర్నమెంటు ప్లీడరు పిప్పి రిజర్వుడుక్లాసు దుర్భిదాటి బ్యాంకెంచికి పోవడానికి సకారణం గనిపించదు. పోనీ! ఎవరైతే నేం?

* * *

చతుర్వేదుల కంటకారణ్యంలో మందారపు మొక్క అనదగువాడున్నూ, అరపాల వారి వడ్డీ కంపెనీలో మేనేజిమెంట్ చేస్తూమాత్రం రెండు, మూడురూపాయల కంటె హెచ్చువడ్డీ తీయని సుగుణాఢ్యుడున్నూ, వీరి కంపెనీ మూలానా మేనమామకు జామీనిచ్చి ఆస్తిని గోల్పోయి, ఫకీరైన ఇంద్రగంటి పొగడ్తలందించిన వాడున్నూ, ఘోషా స్త్రీ__ల దగ్గర సైతము నిరాఘాటంగా

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

సంచరించు అపర క్రీడి అయిన కృష్ణయ్యగారి జ్యేష్ఠభ్రాతయున్నూ అయిన చతుర్వేదుల సుబ్బయ్యగారు 3తేది అస్తమించిరి.

ఆ వెధవ వడ్డీ కంపెనీవల్ల కొంత పేరు చెడ్డది గాని ఆ వంశంలోకి వీరు మంచివారే!

### వెంకటగిరి దౌష్ట్యపాలన!!!

అనాదిగా నివసిస్తున్న 20కాపురాలను లేవదీశారు.

నిండు చూలాలును కూడా లేవదీస్తె, చెట్టు క్రింద ప్రసవించింది ఇదేనా పెద్దమనిషి తనం?

### అల్తూరు పాటి ఘోరం

అల్తూరుపాట్లో మా బంగళా వద్ద 20 ఇండ్లవారు యానాదులు అనాదిగా కాపురముంటున్నారు. వాండ్లు మా విధేయుల లిస్టులో లేని గ్రామ మునసబ్ ఇంట్లో యీ మధ్య పెండ్లయితే పనిపాటలు చేశారనే కారణంతో వాండ్లను మా అడవినౌకర్లు క్షణాలమీద వెళ్ళగొట్టారట. ఉసూరుమంటూ గంపలో కుండలు పెట్టుకొని 20 కపురాలు వెళ్లినవంటె ఎంత ఘోరమో, ఎంత దౌష్ట్యమో, ఎంత అకార్యమో చూడండి.

నిండు గర్భంతో ఉన్న ఒక మాలాలి కుటుంబాన్ని గూడా వెళ్ళగొడితే ఆమె చెట్టుక్రింద ప్రసవించిందట. తర్వాత యింతో మొత్తుకోగా బ్రతిమాలుకోగా ఆమెకు మాత్రం ఆ గుడిశల్లో ఆశ్రయమిచ్చారట. తక్కిన అందరు వెళ్లి పరాయి వూళ్లల్లో తలదాచుకుంటున్నారు.

### ఝూటీబాత్

వెంకటగిరి ఎస్టేటు అత్తివరము చెరువు రిపేరికి గ్రామస్తులను చందా ఇవ్వమని బెదిరించిందా?

వెంకటగిరి తాలూకా అత్తివరం చెరువు రిపేరుకు గ్రామస్తులు మూడోవంతు భరిస్తె, తక్కిన రెండువంతులు ఎస్టేటు వారు భరిస్తామని చెప్పారని గ్రామపెద్దలు రు400 గ్రామం మీద దండినారట. విచారించబోతే యిది అబద్ధమని తేలింది. చూచారా రాజాసాహెబ్! మా దివాణంలో గతికె కుక్కలు ఏం ద్రోహప్రచారం చేస్తున్నవో?

గ్రామస్థుల్లారా!" దొంగలు న్నారు జాగ్రత్త"

---

# దేవాలయం పై మక్కువ దేవుడిపై భక్తి కానేకాదు!

'ధర్మవాన్‌రామ' అంటారు ధర్మానికి నిర్మలమైన ప్రతిబింబమే రాముడు. Rama is in carnation of Dharma. రామాలయం ఎక్కడ నిర్మించినా, పిపీలకాది బ్రహ్మ పర్యంతం, ఎవ్వరి మనస్సు నొప్పించక నిర్మిస్తేనే అది నిజమైన రామాలయం, శ్రీరామ ప్రతిష్ఠ అవుతాయి. ఈ సందర్భంగా విగ్రహారాధన గురించి స్వామి వివేకానంద చెప్పిన మాటలు గుర్తుకు తెచ్చుకోవడం అందరికీ మంచిది.

బీదలలో, వ్యాధిగ్రస్తులలో, శక్తిహీనులలో దేముని చూచేవారు, నిజంగా దేవుణ్ని పూజించే వారౌతాడు. విగ్రహంలో మాత్రం దేముణ్ని చూచేవాని పూజ సామాన్యమైనది. కులము, జాతి, రంగులను పట్టించు కోకండా, అంతరంగంలో దేముణ్ని చూచుకొంటూ, బీదవాడికి సహాయం చేసినా, సేవచేసినా, అటువంటి వారి పట్ల దేముడు మహా ప్రసన్నుడౌతాడు. దేవాలయాలలో మాత్రమే దేముణ్ని దర్శించేవారి కంటె, అటువంటి వారి పట్లనే దేముడు ప్రీతి కల్గి వుంటాడు.

ఇదీ వివేకానంద ప్రవచనం. ఈ సత్యాన్ని రామాలయ నిర్మాతలందరూ, ఆ విషయంలో రభస సృష్టిస్తున్న రాజకీయ వాదులతో సహా మనసులో పెట్టుకొని ముందుకు సాగితే ధర్మం ప్రతిష్ఠ రాముడి పట్ల గౌరవం ఇనుమడిస్తాయి.

—ఆవుల కొండయ్య

గూడూరు

## జనవాణి

### బాపుకు అవమానం భారతదేశానికి అవమానమే!

1893 సంవత్సరం జూన్ నెల 7న మారిట్జ్ బర్గ్ రైల్వే స్టేషన్లో మన జాతిపిత మహాత్మాగాంధి గారిని బలవంతంగా బోగినుంచి దించివేశారు. "తెల్లవారికి మాత్రమే కేటాయించబడ్డ బోగి" అనే కారణంపై ఈ సంఘటన జరిగింది. వర్ణవివక్షతకు అద్దంపట్టే ఈ సంఘటన జరిగి వందసంవత్సరాలు వచ్చే జూన్‌కు పూర్తి అవుతాయి. పై సంఘటనకు గుర్తుగా గాంధీగారి పేరుతో స్టాంపు విడుదల చేయాలని గాంధి మెమోరియల్ కమిటీ నిర్ణయించి, సౌత్ ఆఫ్రికా పోస్టల్ అధికారులకు వ్రాస్తె వచ్చిన ప్రత్యుత్తరం నిజంగా మరలా జాతి వివక్షతకు అద్దం పట్తోంది.

"మామూలుగా మేం స్టాంపు మీద దేశాధ్యక్షుల చిత్రాన్ని మినహా, మరే వ్యక్తి చిత్రాన్నీ చిత్రీకరించం. అయినా గాంధి గారిపై స్టాంపు విడుదల చేయడానికి ఆయనేం దక్షిణాఫ్రికాకు చెందినవారు కాదుగా" అని ప్రిటోరియా పోస్టల్ అధికారి హెర్మనిస్టెయిల్ చెప్పారు.

ఇది గాంధీజీకి జరిగిన అవమానం కాదు. యావద్భారత జాతికీ జరిగిన భరింపరాని అవమానం. ఇది జరిగి, ఈ విషయం పత్రికల్లో వచ్చి పదిహేను రోజులౌతున్నా, ఆ మహానుభావుని పేరు చెప్పుకొని బ్రతుకుతున్న రాజకీయ . వాదు

కొరవ 9 పేజిలో

# చెత్తా చెదారంతో నేలతల్లికి సారం!

పెట్ట సేద్యములో కాని, వీటి పారుదల సేద్యములో గాని సేంద్రియపు ఎరువుల వాడకం రైతుకు లాభదాయకం. సేంద్రియపు ఎరువులలో పశువుల ఎరువు రైతులకు కొంతవరకు అందుబాటు లో వుంటుంది. కాని పశువుల ఎరువును రైతుకు గల మెట్ట లేక మాగాణి పొలాలన్నిటికీ వేయుట సాధ్యపడదు. కనుక రైతులు తమకున్న పశువుల పెంటను కొద్ది పొలమునకు మాత్రమే రెండు మూడు సంవత్సరముల కొకసారి అందుబాటును బట్టి వేస్తారు. పశువుల ఎరువు తమ పూర్తి పొలాలకు అందుబాటులో లేని పరిస్థితులలో కంపోస్టు ఎరువు తయారు చేసుకొని పొలాలకు వాడితే అధిక దిగుబడులు పొందవచ్చు.

కంపోస్టు ఎరువు పశువుల ఎరువునకు ప్రత్యామ్నాయంగా చాలా మంచిది. ఎందుకంటే కంపోస్టు ఎరువులో దాదాపు నత్రజని 0.3 శాతము, భాస్వరము 0.1 శాతము, పొటాషియం 0.3 శాతము ఉంటాయి. అంతే గాక సూక్ష్మ పోషకాలైన జింకు 9.4 పి.పి.యం, కాపర్ 300 నుండి 600 పి.పి.యం, మాంగనీసు 1240 పి.పి.యం.

> ## రైతులోకం
> * * *
> కీర్తి వెంకయ్య
> సి. రంగనాయకులు
> డాక్టర్ శేషగిరి రావు
> వ్యవసాయకళాశాల,
> తిరుపతి

మొలిబ్డినం 0.1 పి.పి.యం వరకు వుంటాయి. సేంద్రియకర్బనము దాదాపు 10 నుండి 15 శాతం వరకు వుంటుంది.

మనకు సాధారణముగా లభ్యమయ్యే సేంద్రియపు పదార్థములయిన పచ్చి ఆకు, ఎడిపోయిన వేరుశెనగ పొట్టు, ఎండుగట్టి, ఎండు ఆకు, చెరుకు ఆకు వివిధ పంటల చెత్తా చెదారాలు, అందుబాటును బట్టి అన్ని రకములను ఒక ప్రత్యేక పద్ధతి ద్వారా 2 నుండి 3 నెలల వ్యవధిలో కుళ్లబెట్టి కంపోస్టు అనే ఎరువును తయారు చేసుకొనవచ్చు. మనకు అందుబాటులో వున్న అన్ని సేంద్రియ పదార్థములతో ఎరువును తయారు చేసి, నేల తల్లికి అందించి, భూసారాన్ని పెంచి, అధిక దిగుబడులను పొందడమే కంపోస్టు తయారీ యొక్క ముఖ్య ఉద్దేశ్యం.

కంపోస్టు తయారీలో గమనించవలసిన మెళకువలు

1. కంపోస్టు ఎరువు తయారు చేయుట అనేది సూక్ష్మ జీవుల ప్రక్రియ.

కొరవ 8 పేజిలో

## సణుగుడు

### మెడికల్ కాలేజిలలో వ్యక్తమౌతున్న వర్తమాన సాంఘిక ధర్మాలు

మెడికల్ కాలేజిల ఆశ అడియాసైపోయినట్టుందే!

ప్రభుత్వాలు ప్రజలకేదో మంచి చేద్దామను కుంటే, కోర్టులకు కన్నుకుట్టు, ఏం చేద్దాం!

విరాళాల దోపిడి వద్దన్నందుకు నష్టం కాలేజిలకా? ప్రజలకా?

ఆర్థికంగా చూస్తే యాజమాన్యాలకి; చదువు పరంగా చూస్తే డబ్బున్న ప్రజలకి!

యాజమాన్యాలకు నష్టం అంటున్నావు- ఫండ్ దండ వద్దన్న తర్వాత కూడా కాలేజిలు, వాటికి యాజమాన్యాలు వుంటాయంటావా?

డబ్బుకోసం కాలేజిలు పెడుతున్నామని ఎవరూ చెప్పలేదు; విద్యాసేవ కోసమే తాము నడుం కట్టామని, 'త్యాగాలకు' సిద్ధపడ్డామని వారు ప్రచారం చేసుకుంటుండినారు; ఇప్పుడు వెనక్కి వెళ్తె పరువు తక్కువ కాదూ?

పరువెవడికి కావాలి- చట్టం ప్రకారం ఫీజులు దండితే ఫ్యాన్ల జీతాలకే చాలవు; పూరి పాకలు కూడా వేయలేరు. పెట్టుబడిగా అయితే ఎంతైనా పెడతారుగాని, చూస్తూచూస్తూ, తిరిగి రావని తెలుస్తున్నపుడు ఇళ్లనుంచి కోట్లు తెచ్చి క్రుమ్మరిస్తారను కున్నావా?

కాలేజిలు కొట్టేసిన సారాయి సామ్రాట్టులకు, పిడబ్ల్యూడి కాంట్రాక్టర్లకు ఆ కోట్లు ఎక్కడి నుంచి వచ్చాయి?

సర్వం జనం సొమ్మే! రాజకీయవాది, ప్రభుత్వాధికారి, వ్యాపారి లేదా కాంట్రాక్టరు ఈ వ్యవస్థలో ప్రజాధనానికి ఒక ముక్కోణపు భక్షకులు. ప్రజల డబ్బు సమస్తం ఈత్రికోణం మధ్యనే తిరుగుతుంటుంది. పన్నుల రూపంలో దండిన ప్రజల సొత్తును ప్రభుత్వం మహా ఉదారంగా ప్రజలకే సబ్సిడి బియ్యం రూపంలోనే, స్కాలర్ షిపుల పేరుతోనే పంచి పెడుతుంది; కూలిచేసి సంపాదించిన సొమ్ములో ఈ సబ్సిడీల మూలంగా మిగుల్చు కున్న డబ్బును ఆ ప్రజలే సారాయి కొని, త్రాగి, తిరిగి ప్రభుత్వానికి కడతారు; సబ్సిడి400 కోట్లయితే సారాయి అర్రక పని ౹ండ ౹ వంద ల కోట్లు అమ్మకంతో వచ్చిన ఆదాయాన్ని మళ్లా ప్రభుత్వం ప్రాజెక్టులకు కేటాయించి, కంట్రాక్టర్ల చేతికి అప్పచెప్తుంది; ఆ కంట్రాక్టర్లు రాత్రి పగలు కష్టపడి, ఇసుకను సిమెంట్‌గా మార్చే ఇంద్రజాల విద్యలు ప్రదర్శించి, వందేళ్లకు డిజైన్ చేసిన డ్యామ్‌లు వందవారాలలో తమంత తాముగా కూలిపోయే అద్భుత ప్రక్రియలు ప్రయోగించి, క్లయిమ్‌లనబడే ప్రభుత్వ ఖజానా డ్రెయిన్‌లద్వారా ప్రజల సొమ్మును తమ ఇళ్లలో భద్రపరుస్తారు.

**డోలేంద్ర**

ఈ మూడు దశలలోనూ రాజకీయవాదికి ప్రభుత్వాధికారికి కష్టం లేకుండా, నెప్పి తగలకుండా, కడుపులో చల్ల కదలకుండా తమ వాటాలు తమకు అందుతాయి. ఈ క్రమంలో ప్రభుత్వ ఖజానాలు ప్రతి ఏటా నిండి, ఎండిపోతుంటాయి. కాలేజిలు వంటివి పెట్టడానికి ప్రభుత్వం దగ్గర ఎప్పుడూ నిధులు మిగలవు- కాంట్రాక్టర్ల దగ్గరైతే కొల్లలుగా వుంటాయి; క్లయిమ్‌లు ఇవ్వడానికి, సబ్సిడీలు పంచడానికి మాత్రం ప్రభుత్వం దగ్గర ఎప్పుడూ నిధుల కొరత వుండదు; బావిలోపల జల ఊరినట్లు వస్తూనే వుంటాయి సబ్సిడీ బియ్యం రూపంలో ప్రభుత్వం ఏటా ఖర్చుచేసే 400 కోట్లతో, ఏదాదికి యాభై మెడికల్ కాలేజిలు కట్టవచ్చు; కానీ ప్రభుత్వం కట్టదు- సబ్సిడి బియ్యం మాత్రమే పంచుతుంది. తెలుగు గంగలోనే.

కొరవ 9 పేజిలో

# కాపీలు కొట్టే ఉత్తీర్ణతలు వద్దు

...స్కూళ్లలో నూటి నూరు శాతం ఉత్తీర్ణతా ఫలితాలు రావడం సంతోషదాయకమే; కాని, అవి కాపీలు కొట్టించి సాధించే పాస్‌లు కాకూడదు; చదివి పరీక్షలు వ్రాసి ఉత్తీర్ణులయ్యేట్టు విద్యార్థులను తయారు చేయగల్గితేనే సార్థకత అన్నారు డిడిఒ శ్రీ సతీష్ చంద్ర. జిల్లాలోని సాంఘిక సంక్షేమ శాఖ వార్డన్లు, హెడ్మాష్టర్లు, ట్యూటర్ల వర్క్‌షాప్ సభలో ప్రసంగిస్తూ – పరోక్షంగానైనా వాస్తవాన్ని ఒప్పుకున్నారు డిడిఒ. పల్లెటూళ్లలోని పెక్కు స్కూళ్లలో పదవ తరగతి పరీక్షలు కాపీల యజ్ఞం మాదిరి జరుగుతుంటాయి. అయ్యవార్లే తమ పిల్లలను ప్రోత్సహించి మరీ కాపీలు కొట్టిస్తుంటారు. సంవత్సరమంతా చదువు చెప్పకుండా కలాయించినపుడు, సంవత్సరం చివర ఆ సహాయమైనా చేయాలి కదా? ఈ పరిస్థితి గమనించే ఆ మరక అంటించి వెళ్లున్నారు సతీష్ చంద్ర.

## సింహపురి

ఈ వర్క్‌షాప్‌ను జాయింట్ కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివరావు ప్రారంభించారు. నాలుగేళ్ల క్రితం కలెక్టర్ శ్రీ కె.రాజా ప్రవేశ పెట్టిన – హాస్టళ్లలో ట్యూషన్ విధానం – సత్ఫలితాలిస్తున్నదని, ప్రత్యేక కోచింగ్ వల్ల 10 తరగతి ఉత్తీర్ణతా శాతం పెరిగిందని చెప్పారాయన. ఈ పరీక్షలో నూరు శాతం ఫలితం సాధించిన ట్యూటర్లకు రెండు వేలు, వార్డన్‌కు వెయ్యి రూపాయలు బహుమతిగా; ట్యూషన్ చెప్పినందుకు నెలకు ట్యూటర్‌కు రూ. 300 లు, వార్డన్‌కు రూ. 100 లు గౌరవభృతిగా ఇస్తామని ప్రకటించారు.

వర్క్‌షాప్ చివరి రోజు, సాంఘిక సంక్షేమ శాఖ కమీషనర్ శ్రీ పి. కమలేశ్వర రావు పాల్గొన్నారు. డిప్యూటి డైరక్టర్ శ్రీ సింహాద్రి కార్యక్రమం నిర్వహించారు.

### ఎపియుయస్ టీచర్ల ధర్నా

ఆం.ప్ర. ఉపాధ్యాయ సంఘం అధ్వర్యంలో 30 తేది నెల్లూరు కలెక్టరేటు ఎదుట టీచర్లు ధర్నాచేశారు. శిబిరాన్ని మాజీ జి.ప్ర.ప ఛైర్మన్ శ్రీ దేగా నారసింహారెడ్డి ప్రారంభించారు; జిల్లా ఎన్‌జిఒల సంఘం అధ్యక్షుడు శ్రీ మల్లారెడ్డి, కార్యదర్శి శ్రీ వై. దుర్గాప్రసాద్, టౌన్ కార్యదర్శి శ్రీ జె. లక్ష్మీనారాయణ, బిఎంఎస్ ప్రధాన కార్యదర్శి శ్రీ కోడూరు సత్యనారాయణ, జిల్లా బిజెపి అధ్యక్షుడు డాక్టర్ సి.హెచ్. వరదయ్య, ప్రధాన కార్యదర్శి శ్రీ ఎస్. సుబేవిరెడ్డి, టౌన్ అధ్యక్షుడు శ్రీ ఆచార్య అదిత్య, తదితరులు పాల్గొన్నారు. ధర్నాకు శ్రీ ఎ. రాజగోపాల రెడ్డి, జిల్లా సంఘం అధ్యక్షుడు డాక్టర్ పెళ్ళకూరు రవీంద్ర రెడ్డి నాయకత్వం వహించారు.

టీచర్లు చేసే ధర్నాలో ఇందరు రాజకీయవాదులెందుకు? ఏ సమస్య సాధనకోసం ఆందోళన చేస్తున్నది అయ్యవార్లకే స్పష్టంగా తెలియని పరిస్థితిలో ఆందోళనదేనికి?

కొరవ 8 పేజిలో

## ఇండియా గాంధీస్తాన్ కానప్పుడు నెల్లూరు శ్రీరాములు జిల్లా ఎందుకు కావాలి?

# పేరు మారిస్తే అంత్యోత్సవమే!

నెల్లూరు జిల్లా ద్విశతాబ్ది వుత్సవాలు ఈ ఆగస్టు నెల లోనో లేక తర్వాత నెలలోనో ఘనంగా జరపాలని పెద్దలు నిర్ణయించినట్లు వినికిడి. శుభం! "ఏమున్నది గర్వకారణం" అనే శ్రీశ్రీగారి ప్రశ్నకు ఈ సందర్భంలో జవాబు వెదికితే గత రెండు శతాబ్దాలలో నెల్లూరు జిల్లా ఏ విధమైన అభివృద్ధి సాధించినట్లు కన్పడడం లేదు.

పెన్నానది నీళ్ళు జిల్లాలో వ్యవసాయానికి వుపయోగించారు, రైళ్లు వేశారు, రోడ్లకు వంతెనలు కట్టారు వంటి విషయాలు ప్రత్యేకంగా చెప్పుకోనక్కరలేదను కొంటాను. నాకు తెలిసినంత వరకు జిల్లా ఈ రెండువందలేళ్లలో భౌగోళికంగా కృశించిపోయింది. ఒకప్పుడు ఒంగోలు అవతల వరకు వున్న జిల్లా తగ్గి, కందుకూరు డివిజన్ వరకే పరిమితమైంది. తర్వాత ప్రకాశం జిల్లా ఏర్పాటుతో మనుమసిద్ధి కాలానికి ముందు నుంచి నెల్లూరు తో సంబంధం కల్గిన కనిగిరి, కందుకూరులు విడిపోయాయి. ఇంక కొద్ది రోజులలో గూడూరుకు దక్షిణ

> ### తిక్కవరపు కోదండరామరెడ్డి

ప్రాంతమంతా బాలాజీలో ఐక్యమై పోతుందంటున్నారు. ఇక మిగిలిన బెత్తెడు జిల్లాకు నెల్లూరు జిల్లా అనే పేరు అప్రస్తుతమని "పొట్టి శ్రీరాముల జిల్లా" అని పేరు పెడుతారట. ఇదీ జిల్లా అభివృద్ధి.

ఈ పేరు మార్పు శ్రీరాములు గారి కీర్తికి మెరుగు తెస్తుందో లేదో గాని నెల్లూరు జిల్లాకు మాత్రం అన్యాయం తప్పక అవుతుంది. వీధికో, జిల్లాకో, రాష్ట్రానికో పేరు పెట్టనిదే గాని శ్రీరాములు గారి గౌరవానికి లోపమనుకున్నప్పుడు, ఆంధ్ర రాష్ట్రానికే ఆ పేరు పెడితే ఇంకా గొప్పగా ఉంటుంది. ఆయన త్యాగం ఒక్క నెల్లూరు జిల్లాకే పరిమితం కాలేదు గదా!

భరతుడు పాలించినది కాబట్టి భారతదేశమైందని వాడుక. భరతుడి తర్వాత ఎందరో రాజులు, సాక్షాత్తు దేవుళ్లనిపించుకున్న వాళ్ళు పాలించిన ఈ దేశాన్ని ఇప్పటికీ భారతదేశమనే అంటున్నారు. ఇది రామభూమికాలేదు, బుద్ధ స్థాన్ కాలేదు, గాంధీ ల్యాండు కాలేదు. అయితే ఆ మహానుభావుల మీద

కొరవ 9 పేజిలో

# నెల్లూరు ముచ్చట్లు

**విమర్శకుడు**

## 16 తేది ముఖ్యమంత్రి నెల్లూరు రాక?

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి 16 తేది నెల్లూరు రావచ్చని అనధికార వర్తమానం. టిసిసి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి మనుమరాలు వివాహం ప్రధాన కార్యక్రమం. ఎందుకైనా మంచిదని కలెక్టరాది అధికారులు 16,17 తేదిలకు సరిపడా పలు అధికార కార్యక్రమాలు తయారు చేసి పెడుతున్నారు.

రాపూరు డిగ్రీకాలేజి భవనాల ప్రారంభోత్సవం, నెల్లూరులో బాలలు, మహిళల శిక్షణా కేంద్రం, వేణుగోపాలస్వామి కాలేజి భవనాలకు పునాదిరాయి, జగదేవిపేటలో వెటరినరి ఆస్పత్రి రిబ్బన్ కత్తిరింపు, మోపిదిలో హౌసింగ్ కాలని, చింతవరంలో ప్రపంచ బ్యాంకు రోడ్డు పని, కృష్ణాపట్నంలో రొయ్యల పెంపక కేంద్రం ప్రారంభాలు వగైరా కార్యక్రమాలు వుండేట్లున్నాయి. 17 తేది వెంకటగిరిలో పర్యటిస్తారట.

17 నుంచి అసెంబ్లీ మొదలయ్యే పక్షంలో ఈ కార్యక్రమాలు రద్దు అయినా కావచ్చు.

## పెళ్ళకూరుకు సన్మానం

'ఇఫ్కో' అధ్యక్షుడుగా నియమితులైన శ్రీ పెళ్ళకూరు రామచంద్రారెడ్డికి 9 తేది సాయంత్రం కస్తూరిబా కళాక్షేత్రంలో పెద్ద ఎత్తున సన్మానం జరుగబోతుంది. మేగొటి, శ్రీ కొండాబలరామిరెడ్డి గారలు పందకు మించిన సభ్యులతో ఇందుకోసం ఒక అతిథేయ సంఘం ఏర్పరచి, సన్మానం జరిపిస్తున్నారు.

రామచంద్రారెడ్డిగారు, పదవీ స్వీకారం తర్వాత నెల్లూరు రావడం ఇదే ప్రథమం. దేశంలోని అతిపెద్ద సహకార రంగ పరిశ్రమ – ఇఫ్కో ! 30 వేల చిన్న చిన్న సహకార సంస్థలు అందులో సభ్యులుగా వున్నాయి. సంస్థ ఆస్థుల విలువ 5 వేల కోట్ల పై నుంటుందట. 4 ఫ్యాక్టరీలు భారతదేశంలో, ఒకటి ఆఫ్రికాలో వున్నాయి. 6 వేల మంది ఉద్యోగస్తులు పనిచేస్తున్నారు. ఇఫ్కో దగ్గర విస్తారంగా నిధులున్నాయి. వ్యవసాయ పరమైన ఏ వ్యాపకమైనా చేపట్టేందుకు వీలుంది. అయితే ఇప్పటి వరకు ఇఫ్కో కార్యకలాపాలన్నీ ఉత్తర భారతదేశానికే పరిమితై వున్నాయి. రామచంద్రారెడ్డి గారు దానిని దక్షిణ భారతదేశానికి, ఆంధ్రప్రదేశ్‌కు విస్తరింపజేయాలని తలపెడుతున్నారు. ఇఫ్కో తరపున దాదాపు 600 కోట్ల రూపాయలతో కొత్తపరిశ్రమలు స్థాపించే వీలుందిప్పుడు.

ఇఫ్కోకు ఛైర్మన్ కావడంతో, దేశంలోని పెద్ద ఎరువుల కంపెనీలైన ఇండియన్ పొటాష్ లిమిటెడ్, క్రిబ్‌కో, గోదావరి ఫర్టిలైజర్స్ సంస్థలలోనూ రామచంద్రారెడ్డి గారు డైరక్టరుగా నియమితులైనారు. పిటున్స్పంటిలో ఇఫ్కో పెట్టుబడి వుంది.

దశాబ్దాల తరబడి స్నేహ ధర్మం విడకుండా, అంటి పెట్టుకొని వుండిన రామచంద్రారెడ్డి గారికి ప్రధాని పి.వి. పెద్ద పదవి సత్కారమే చేశారు. ఇంత బరువు మోయడం ఆయన వల్ల అవుతుందంటారా?

## క్విట్ ఇండియా ఉద్యమం – నెల్లూరు

స్వాతంత్ర్య సిద్ధికి జరిగిన పోరాటాల్లో ఆఖరిదైన 'క్విట్ ఇండియా' ఉద్యమానికి ఈ 9 తేది స్వర్ణోత్సవం. సత్యాగ్రహాలు, నిరసన వ్రతాలు, సహాయ నిరాకరణల వంటి శాంతియుత వుద్యమాలు నడిపిన గాంధీజీ బొంబాయి కాంగ్రెస్‌లో బ్రిటిష్ ప్రభుత్వానికి 'క్విట్ ఇండియా' అంటూ శంఖారావం పూరించారు. ఆ యుద్ధభేరితో యావద్దేశం వుద్రూత లూగిపోయింది; ఎక్కడికక్కడ ప్రభుత్వ వ్యతిరేక చర్యలు, కాల్పులు, చావులు, నాయకులందరి అరెస్టులతో దేశమే అల్లకల్లోలమై పోయింది. ఆ మహోద్యమంలో ఎన్ని వందలు వేల మంది యువకులు ప్రాణాలు కోల్పోయారో చెప్పలేము. ఒక్క నాయకుడు బయట లేడు. గాంధీజీ ధర్మపత్ని శ్రీమతి కస్తూరిబా అహమ్మద్ నగర్ కోట నిర్బంధంలో అసువులు బాసింది; గాంధీజీ విశ్వాస పాత్రుడైన కార్యదర్శి మహాదేవదేశాయ్ మృత్యువాత బడింది అప్పుడే. జయప్రకాష్ నారాయణ్ లాహోర్ జైల్లో చిత్రహింసలకు గురియైంది అప్పుడే. భారత దేశంలో పాతుకొని పోయివుండిన బ్రిటిష్ ప్రభుత్వ పీఠాన్ని వణికించింది, కదిలించింది, బీటలు వారించింది ఆ ఒక్కమాట -"క్విట్ ఇండియా". అటువంటి జాతీయ పర్వదినం ఆగస్టు 9.

క్విట్ ఇండియా వుద్యమంలో నెల్లూరు జిల్లాకు పెద్ద పాత్ర వున్నట్టు లేదు. అల్లూరు పోలీస్ స్టేషన్‌ను తగులబెట్టడం తప్ప చెప్పుకోదగిన పెద్ద సంఘటన ఏదీలేదు. అల్లూరు పోలీస్‌స్టేషన్ దగ్గరికి నాయకత్వం వహించిన వారు కీ.శే. బత్తిన రామకృష్ణారెడ్డిగారు, ఆయన తోటి మరో అరడజన్ మంది కూడా నిర్బంధింపబడినారు. ఆ సమయంలో అక్కడ ఎస్ఐ గా వుండిన హనుమంత రావు గారు తానుగా రాజీనామా ఇచ్చారో, ప్రభుత్వమే ఆయన్ను వుద్యోగం నుంచి తొలగించిందో తెలియదుగాని, తర్వాత ఆయన కాంగ్రెస్ సేవాదళాధిపతిగా పనిజేశారు.

నెల్లూరులో మొట్టమొదట అరెస్టు గావింపబడిన వారు ఓరుగంటి వెంకటసుబ్బయ్య, మన్నేపల్లి హనుమంతరావు, ముత్తరాజు గోపాలరావు గారలు. శ్రీ బెజవాడ గోపాలరెడ్డి ప్రభృతులు బొంబాయి కాంగ్రెస్ నుండి నెల్లూరు చేరిన కొంత కాలానికి డిటెన్యూలుగా నిర్బంధంలోకి తీసుకోబడ్డారు. వెన్నెలగంటి రాఘవయ్య గారు మార్గమధ్యంలోనే అరెస్టుజేసి జైలుకుపంపబడ్డారు. ఇదే విధంగా జిల్లా వ్యాప్తంగా అరెస్టులు జరిగాయి. పేరు గలిగిన ఒక్క కాంగ్రెసునాయకుడూ బయట లేకుండా పోయారు. ఆ చీకటి రోజుల్లో బయట ఎవ్వరూ లేక కోవూరు తాలూకా పాల్లపల్లికి చెందిన స్వర్గీయ కాకు సుబ్బరామరెడ్డి కాంగ్రెస్ నియంతగా నియమింపబడ్డారు. కాంగ్రెస్ కార్యకలాపాలన్నీ అజ్ఞాతంగా తప్ప, బహిరంగంగా జరగలేదు.

ప్రతిచోట విద్యార్థులు కాలేజీలు, స్కూళ్లు బహిష్కరించారు; వుత్సవాలు వూరేగింపులు జరిపారు. అప్పుడు కొందరు ముస్లిం విద్యార్థులు మాత్రం కాలేజికి హాజరయ్యారు. కమ్యూనిస్టులు క్విట్ ఇండియా వుద్యమానికి వ్యతిరేకులనే విషయం ప్రజలకు తెలిసిందే. వార్తా ప్రచురణ మీద ప్రభుత్వం విధించిన నిర్బంధాలకు నిరసనగా 'జమీన్‌రైతు' 30.8.42 నుండి 20.11.42 వరకు ప్రచురణను ఆపి వేయక తప్పలేదు. అందువల్ల ఆ వుద్యమానికి సంబంధించి మన జిల్లాలో ఎక్కడెక్కడ ఏమి జరిగింది వివరంగా తెలుసుకొనే అవకాశం లేకుండా పోతున్నది.

ఇంత చారిత్రాత్మకమైన క్విట్ ఇండియా దినాన్ని ఈ సంవత్సరం జిల్లా కాంగ్రెస్ సంఘం గాని, మరెవరూగాని జరుపుతున్నట్లు లేదు. అత్యంత విచారకమైన విషయం ఇది. జిల్లా స్వాతంత్ర్యయోధుల సంఘం మాత్రం 15 తేది సమావేశమై వీరులకు శ్రద్ధాంజలి ఘటిస్తుందట. సంస్మరించవలసిన దినం 9 తేది కాదా? ఈ సందర్భంలో ఆ మహోద్యమంలో ప్రాణాలు కోల్పోయిన వారికి, కష్టనష్టాలకు గురియైన యోధులకు భక్త్యంజలి ఘటిస్తున్నాము.

## కలెక్టరు రాజా వచ్చారు!

ట్రెయినింగుకు పోయి వుండిన కలెక్టరు శ్రీ కె.రాజా 2 తేది చార్జీతీసుకున్నారు. రాజాగారికి మళ్లీ నెల్లూరుకు తిరిగి వచ్చే వుద్దేశ్యం వున్నట్లులేదు. ప్రభుత్వానికి ఆయన ఇక్కడ నుండి పోవడం ఇష్టం వున్నట్లు లేదు. ఫలితం తిరిగి వచ్చి చార్జీ తీసుకోవడమే.

రాజాగారికి జిల్లా ద్విశతాబ్ది వుత్సవాల పట్ల ప్రత్యేక శ్రద్ధా సక్తులు పట్టుదల వున్నట్లున్నాయి. అటువంటప్పుడు అవి జరగకుండా ఆయనెక్కడికి పోతారు? ఆయన రాక సంతోష దాయకం.

కొరవ 6 పేజిలో

# నెల్లూరు ముచ్చట్లు

(5 పేజీ కొరవ)

## శంకర రెడ్డి పదవీ స్వీకారం

ఆర్‌టిసి విక్రమ సింహ డివిజన్ ఛైర్మన్‌గా నియమింపబడిన శ్రీ చెలికం శంకర రెడ్డి ఈ రోజు అనందోత్సాహాలతో, అనుచర అభిమాన గణంతో యాభై మైళ్లు ఊరేగింపుగా వెంచి మధ్యాహ్నం 2 గంటలకు ఆడంబరంగా పదవీ స్వీకారం చేశారు. రాష్ట్రపతి, ప్రధాని, ముఖ్యమంత్రి పదవీ స్వీకారోత్సవం కూడా అంత వేడుకగా వుండదనుకోండి!

ఈ సందర్భంలో ఇందిరా భవన్‌లో శ్రీ శంకర రెడ్డి అభినందన సభ శ్రీ ఆనం సంజీవ రెడ్డి అధ్యక్షతన జరుగుతున్నది. శంకర రెడ్డి అదృష్టవంతుడు; ఆయనకు మా హార్దికాభినందనలు.

## ప్రిస్టేజ్ కాలేజి

నెల్లూరులో మొట్టమొదటిగా మైనారిటీస్ జూనియర్ కాలేజి నెలకొల్పబడింది. అల్ అమీన్ నాయిబ్ రసూల్ ఎడ్యుకేషనల్ చారిటబుల్ ట్రస్ట్ ఆధ్వర్యంలో నెలకొల్పబడుతున్న ఈ కళాశాలకు 8 తేది సాయంత్రం రంగనాయకుల పేటలోని ఇన్‌కంటాక్స్ భవన ప్రాంగణంలోని ఆఫీసు సముదాయంలో బెంగుళూరుకు చెందిన డాక్టర్ ముంతాజ్ అహమ్మద్ ప్రారంభోత్సవం జరుపుతారు. జనాబ్ ఇబ్రహిం ఖలీలుద్దీన్ ఖాన్ సాహెబ్ అధ్యక్షత వహిస్తారు. మాగుంట, జె.కె., జె.వి., ఆనం సంజీవరెడ్డి గారలు ముఖ్యఅతిథులు. మాజీ ఎం.పి. శ్రీ గౌస్ మొహిద్దీన్, మాజీ మునిసిపల్ వైస్ ఛైర్మన్ మహమ్మద్ హైదర్, హాజీ ఎస్. సూలేమాన్ ఈ కార్యక్రమానికి అందరినీ ఆహ్వానిస్తున్నారు. ఈ ముస్లిం కాలేజీలో కోఎడ్యుకేషన్ వుంటుందట; కాలేజీ పేరు ప్రిస్టేజ్అని పెట్టడంలో నిర్వాహకుల వుద్దేశ్యం లాభాపేక్షతో కాకుండా సేవా దృక్పథంతో నడపడమేనట. విజయోస్తు!

## గోటితో పొయ్యేదాన్ని గొడ్డలిదాకా తెచ్చారు!

స్వల్పమైన మాట సర్దుబాటుతో సమసి పోవలసిన విషయాలు ఒక్కొక్కసారి ఎంతెంత పెద్ద రాజకీయ దుమారాలుగా పరిణామం చెందుతాయో తెలుసుకోవడానికి ముఖ్యమంత్రి మేనల్లుడు మధుసూదనరెడ్డి పోలీసు రభసే ఉదాహరణ. చిన్న ట్రాఫిక్ సమస్య ఇది. పెద్ద రాజకీయ రభసగా మారుతున్నది.

శ్రీ మధుసూదన రెడ్డి 31 తేది సాయంత్రం ట్రంకురోడ్డులోని కోనికా ఫోటో స్టూడియో దగ్గర కారు నిలిపి, లోపలకుపోయాడట. ఒక కానిస్టేబిల్ వచ్చి కారును ప్రక్కకు తీయమన్నాడు. డ్రైవరు తీయలేదు. తొందరగా పనిచేసుకొని వెళ్లిపోతామని చెప్పాడట. ఇద్దరి మధ్యమాటామాటా పెరిగింది; ఎక్కాలు పట్టుకున్నారు. ఇది గమనించి దగ్గరలో వుండిన ఎఎస్ఐ డ్రైవరును దబాయించినట్లున్నాడు. అతడిపైకి తిరగబడ్డాడట ఆ డ్రైవరు. ఈలోగా వన్‌టౌన్ ఎస్ఐ ఆ ప్రదేశానికి వచ్చి, డ్రైవరును పోలీసు స్టేషనుకు తీసుకవెళ్లమన్నాడట. ఆ దశలో మధు బయటకు వచ్చి, ఎస్ఐతో డ్రైవరును వదలమని చెప్పాడట. కాని ఆ మాటను ఎస్ఐ విన్పించుకోలేదు. ఆ సమయానికి మధు ఎవరో ఎస్ఐకు తెలియదట.

డ్రైవర్ వెనుకగా మధు స్టేషన్‌కు స్కూటర్‌పై వెళ్లాడట. అప్పటికే డ్రైవరును నాలుగు దెబ్బలేసి, ఎక్కాప్యాంటు ఊడదీసి, లాకప్‌లో పెట్టి వుండినారట. అది చూసి మధుకు కష్టం కల్గింది. ఈలోగా ఎస్ఐ వచ్చేసరికి, మధు తన డ్రైవరుతోపాటు తననూ అరెస్ట్ చేయమని పట్టుబట్టాడట. ఆ సరికి మధు ఎవరో తెలుసుకొన్న ఎస్ఐ, డ్రైవరును వదిలెయ్యమని చెప్పారు. కానిస్టేబిళ్లు లాకప్ తెరవగానే మధు లోపలకు పోయి నిలబడ్డాడట. బయటకు రమ్మంటే రాలేదు. ఎస్ఐ వచ్చి బలవంతంగా బయటకు లాగబోయాడట. ఇద్దరి మధ్య త్రోపులాట జరిగింది. అంతలోయూత్ కాంగ్రెస్ నాయకుల జంట దేవకుమార్ రెడ్డి, సునీల్ కుమార్ రెడ్డి వచ్చారు. వారు ఎస్ఐ పై విరుచుక పడినట్లున్నారు. రెండు పక్షాల మధ్యా తిట్లు శాపనార్థాలు నడిచాయి. ఉద్రిక్తత పెరిగింది. సిఐ వచ్చి సర్దబోయినా శాంతపడలేదు. విషయం తెలుసుకొన్న డిఎస్‌పి శ్రీ మురళి స్టేషన్‌కు వచ్చి, ఇద్దర్నీ విడదీసి, పంపేశాడట.

ఇదీ జరిగింది! రోడ్డుకు అడ్డంగా కారు వున్నప్పుడు కానిస్టేబిల్ తీయమంటే ఎవరి కారైనా ప్రక్కకు తీయాలి. డ్రైవరు కారు జరిపి వుండినా లేదా సౌమ్యంగా సమాధానం చెప్పివుండినా ఇందులో పేచీయే లేదు. డ్రైవరు తప్పుచేస్తే, అంత పెద్ద రచ్చ చేయాల్సిన అవసరం పోలీసుకు లేదు. ముఖ్యమంత్రి మేనల్లుడి డ్రైవరే కాదు – ఇంకొకరితోనైనా సరే పోలీసులు అంత దురుసుగా వ్యవహరించడం నేరమే. ట్రాఫిక్ రూల్ దాటితే గుడ్డలిప్పి లాకప్‌లో పెట్టాల్సిన అగత్యమేమిటి? మధుకూడా అంత తొందర పడకుండా వుంటే బాగుండేది. ఎస్ఐ దురుసుగా వ్యవహరిస్తే ఎస్పీకో డిఎస్‌పికో చెప్పి సరిదిద్ది వుండవచ్చు. తాను ఇంట్లో వుండే డ్రైవరును రప్పించుకొని వుండవచ్చు. స్టేషన్‌కు పోయి తననూ అరెస్టు చేయమని పట్టుబట్టడం, యువనాయకులు స్టేషన్‌లో ఎస్ఐను తిట్టడం తప్పే కదా? తమ వెనుక అధికారంలో వున్న పేర్లు ముడిపడి వున్నపుడు ఎంత సహనంతో, సౌమ్యతతో ప్రవర్తిస్తే అంత మంచిది.

ఇప్పుడు ఎస్ఐను ప్రకాశం జిల్లాకు బదలీ చేశారు. ముఖ్యమంత్రి మేనల్లుడికే పోలీసుల దగ్గర మర్యాద లేనపుడు, ఇతరుల గతి ఏమిటి అన్న ఆలోచన ఎస్ఐను శిక్షించడానికి కారణమేమో! దురదృష్టకరమైన ఈ సంఘటన ముఖ్యమంత్రి వ్యతిరేకులకు మంచి విమర్శనాస్త్రంగా ఉరికింది. ఎస్ఐను అన్యాయంగా శిక్షించారనే నిందతో వారు ఆందోళన ప్రారంభిస్తున్నారు. ముఖ్యమంత్రి అల్లుడు కాకుండా మరొకరు ఈ సంఘటనలో వుండివుంటే, పోలీసు జులుం నశించాలనే నినాదంతో వీరు అలజడి చేసివుండేవారు.

ఉభయ పక్షాలు ఉద్రేకంతో, ఆవేశంతో, తొందర పాటుతో ఇప్పటికే ముఖ్యమంత్రి పేరును వీధిలోకి లాగారు. ఇది ఇంకా శృతి మించకముందే పునరాలోచన చేసుకొని, సర్దుకోవడం మంచిది. బదలీ చేయడం ఎస్ఐకి పెద్ద శిక్షా? ఆ ఎస్ఐ తన తప్పు తాను తెలుసు కొనేటట్లు చేయడానికి ఇతర మార్గామార్గాలేవీ లేవా? యువకుల ఉద్రేకానికి తాను ప్రభావితుడై ముఖ్యమంత్రి తనకు తానుగా ఈ వివాదంలో ఇరుక్కోవడం సముచితమా? ఈసమయంలో యస్ఐని వెంటనే బదలీ చేయకుండా విచారణలు గివారణలు జరిపి తొందర పాటులు నిర్ధారించుకొని ఆ పిమ్మట చర్యతీసుకొని వుంటే పోలీస్ అధికార్లలో నిరుత్సాహం నిర్వీర్యతా కలుగకుండా వుండేది; ముఖ్యమంత్రి ప్రతిష్ఠ పెరిగి వుండేది.

## ఎస్.ఇ., సి.ఇ. అయ్యాడు!

విద్యుచ్ఛక్తి శాఖ నెల్లూరు ఎస్.ఇ. శ్రీ ఎస్. గురుమూర్తి రెడ్డి ప్రమోషన్‌తో నెల్లూరులోనే ఛీఫ్ ఇంజనీరుగా నియమింపబడి, ఈ రోజు చార్జీ తీసుకున్నారు. ఆయన స్థానంలో ఎస్.ఇ. గా శ్రీ సి. శివశంకర రెడ్డి నియుక్తుడైనాడు; ఆయన ప్రమోషన్ పై కర్నూలు నుండి వస్తున్నారు.

నెల్లూరు సి.ఇ. క్రింద నెల్లూరు – చిత్తూరు – ప్రకాశం జిల్లా లుంటాయి. గురుమూర్తి రెడ్డి నెల్లూరు అల్లుడు; ఆనం సంజీవ రెడ్డికి బంధువు. సౌమ్యుడు, వివాదరహితుడు. ఆయనకు మా అభినందనలు.

# పినాకినీ తీరం

(2 పేజీ కొరవ)

సరిపోదా? అందుకే నా నిశ్చితాభిప్రాయం యూత్ కాంగ్రెస్ అనేది ప్రత్యేకంగా ఒకటి అనవసరం అని! ఏ కొందరు వ్యక్తులను దృష్టిలో వుంచుకునో, కొన్ని సంఘటనలను మనసులో వుంచుకునో నాకిటువంటి అభిప్రాయం ఏర్పడలేదు; పై నుండి క్రింది వరకు యూత్ కాంగ్రెసీయుల విపరీత వైఖరులను గమనించే వారెవరికైనా అటువంటి అభిప్రాయమే కలుగుతుంది!

నాని

# మెడికల్ కాలేజీలు

(మొదటి పేజీ కొరవ)

పోతే, కోట్లతో పని. ఈ పరిస్థితిలో మంజూరైన కాలేజీలు తెరిచినంత వరకు అనుమానమే. మాగుంట సుబ్బరామిరెడ్డి, అపోలో ఆస్పత్రి, ముఖ్యమంత్రి కుటుంబీకుల జనప్రియ కాలేజీ మాత్రం ఎట్టి పరిస్థితులలోనూ ప్రారంభం కావచ్చునని అంచనా. అపోలోఆస్పత్రికి హైదరాబాదులో హంగులన్నీ ఉన్నాయి. ఆస్పత్రి కూడా కట్టనవసరం లేదు.

వ్యక్తిగతంగా మాగుంట సుబ్బరామరెడ్డి గారి వైఖరి తెలిసిన వారు ఆయన నిర్ణయం ఏమౌతుందన్న విషయం తేలిగ్గా పసిగట్టగలరు.

జనప్రియ సైతం ఒనేషన్లు వున్నా లేకున్నా నడపక తప్పదు. లేకుంటే ముఖ్యమంత్రిపై అది పెద్ద రాజకీయ నిందగా మారుతుంది.

# ఆర్‌ఎల్‌రెడ్డి

(2 పేజీ కొరవ)

సంవత్సరాలు నిండుతాయి. ఇదే నాకు ఆనందం. ఉత్తరాదిన మొరార్జీ, దక్షిణాదిన నేనూ మిగిలి ఉన్నాం. నేను గాంధీజీ సాగించిన ఐదు సత్యాగ్రహ పోరాటాల్లోనూ పాల్గొన్నాను. ఆయన అనుచరుడిగా జీవించాను. ఆ తర్వాత చెప్పుకోదగిన భాగ్యం రవీంద్రుడ్ని స్వయంగా చూడడం, ఆయన సంగీతం వినడం, ఆయన్తో మాట్లాడినాను. భావాలలో ఆధునికుడూ, నవభారత నిర్మాణ సారథీ అయిన నెహ్రూగారి చివరి మంత్రి వర్గంలో మంత్రిగా పనిచేశాను. ఆయన సాన్నిహిత్యాన్ని అనుభవించాను. ప్రస్తుతం నీతికి దూరం కాని స్వేచ్ఛను అనుభవిస్తున్నానూ అన్నారు గోపాలరెడ్డి. ఆ చివరిమాట అంటున్నపుడు ఆయన స్వరంలో భావోద్వేగం కనిపించింది.

# మట్కా జూదానికి తెలుగు సినిమాకు తేడాయేలేదు!

## సినిమా

ఇదివరకటి చిత్రాలలో బలమైన సన్నివేశాల మధ్య ప్రేక్షకులకు కాస్త రిలీఫ్ కల్గించడానికి సున్నితమైన హాస్యాన్ని కథలో అంతర్లీనంగా ప్రవేశ పెట్టేవారు. కస్తూరి శివరావు, రేలంగి, రమణారెడ్డి వంటి ప్రముఖ నటులు ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించేవారు. ఇప్పుడటువంటి హాస్యమే కరువైంది. కథకు అతకని ముతక హాస్యాన్ని

## ఎన్ని చిత్రాలు బోల్తా కొట్టినా

బలవంతంగా చొప్పిస్తున్నారు. బాబూమోహన్, బ్రహ్మానందాల హాస్యమే ప్రస్తుతం తెలుగు సినిమాను ఏలుతోంది. ద్వంద్వార్థ సంభాషణలు, కుప్పిగంతులు, వెకిలి చేష్టలకు ప్రేక్షకులు విసుగెత్తిపోయారు. మట్కా స్థాయిలో వుంది ప్రస్తుత తెలుగు సినిమాల స్థితి. గుర్రప్పందాలు, షేర్ మార్కెట్ స్పెక్యులేషన్లకు ఏ మాత్రం తీసిపోవడం లేదు. బాక్సాఫీస్ వద్ద ఎన్నో చిత్రాలు బోల్తా కొడుతున్నా, తయారయ్యే చిత్రాల సంఖ్య అంతకంతకు పెరుగుతూనే వుంది. తెలుగు సినిమా భవిష్యత్, ప్రస్తుత పరిస్థితి 'ఎంతో ఆందోళనకరంగా ఉన్నాయని' సినీ ప్రముఖులు గగ్గోలు పెడుతున్నా 'జాక్‌పాట్' కొట్టవచ్చునే ధీమాతో కొత్త నిర్మాతలు ప్రవేశిస్తున్నారు. రాశిలో తెలుగుచలన చిత్రాభివృద్ధి కనిపిస్తోందే గాని వాసిలో మాత్రం కాదు.

### "ప్రెసిడెంటు గారి పెళ్ళాం"

డైరెక్టర్ ఎ. కోదండరామిరెడ్డి వద్ద నుంచి హిట్ పిక్చర్ పేరి [illegible]లమైంది. అంకిత, అయినప్పుడు కూడా, ఎంతో దీక్షతో కృషి చేస్తున్నారు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వి. దొరస్వామిరాజు నిర్మిస్తున్న వి.ఎం.సి. ప్రొడక్షన్స్ "ప్రెసిడెంటు గారి పెళ్ళాం" చిత్రంలో నాగార్జున, మీనా, సత్యనారాయణ, చంద్రమోహన్, కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం, చిట్టిబాబు, విశ్వేశ్వరరావు, అన్నపూర్ణ, సుధ, శాంతి, బేబి సునయన నటిస్తున్నారు. సంగీతం: కీరవాణి.

సరసాల సోగ్గాడులో లతశ్రీ, బ్రహ్మానందం

### చిత్రం పేరు మార్పుకు ఆందోళన

"జి.టి. రోడ్డు మీద కొట్టయ్యో... జి.టి బండి కాని పెట్టయ్యో... జిగిబిగి జమ్" ఈ పాట గోపి ఆర్ట్ పిక్చర్స్ "దంగపోలీస్" చిత్రంలోనిది. మన సినిమా పాటలు, సాహిత్యం ఏ స్థాయిలో వున్నాయో తెలుసుకోనడానికి ఇదో మచ్చుతునక. మోహన్‌బాబు, మమతాకులకర్ణి, బ్రహ్మానందం, బాబూమోహన్, మోహన్‌రాజా, కోట శ్రీనివాసరావు, అచ్యుత్, డిస్కోశాంతి వగైరా నటవర్గం. సంగీతం: బప్పిలహరి, నిర్మాత: చలసాని గోపి. దర్శకత్వం: కె.ఎస్. ప్రకాష్.

"దంగపోలీస్" టైటిల్ పోలీసులను కించపరిచేదిగా ఉన్నదిగనుక దానిని వెంటనే మార్చాలని, లేని పక్షంలో ఆందోళనను ఉధృతం చేస్తామని ప్రకాశం జిల్లా పోలీస్ ఆఫీసర్స్ అసోసియేషన్ అడ్వైజింగ్ సెక్రటరి షేక్ ఖాసిం సాహెబ్ నిర్మాతలకు తెలియజేశారు. పోలీసులను వ్యసనపరులుగానూ, ప్రజలను రక్షించాల్సింది పోయి భక్షించేవాళ్ళగా చిత్రీకరించడం వల్ల పోలీసు వ్యవస్థ పట్లనే ప్రజలలో చులకనభావం ఏర్పడుతుందన్న ఆందోళన వారిలో కన్పడుతుంది. అయితే "దంగపోలీస్" పేరు మార్చినంత మాత్రాన ప్రజల వున్న ఆ న్యూనతాభావం తొలగిపోతుందా!

### మాగుంట సుబ్బరామిరెడ్డి పూజతో ప్రారంభమైన శ్రీధర్ రెడ్డి చిత్రం

నెల్లూరీయుల చిత్రాల ప్రారంభోత్సవాలకు అతిరథ మహారథులు హాజరవడం మామూలే. కాని, ఆగస్ట్ 1

## సినిమా

తేది ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో పి. శ్రీధర్ రెడ్డి నిర్మించే శ్రీ సాయిశాంతి ఫిలిమ్స్ చిత్రానికి తిరుపతికి 10 కిలోమీటర్ల దూరంలో ఉన్న దుర్గసముద్రం గ్రామంలో ప్రారంభోత్సవం జరిగినప్పుడు శుభాకాంక్షలు అందజేయడానికి మద్రాసు నుంచి చలన చిత్ర ప్రముఖులెందరో విచ్చేయడం తోపాటు ప్రముఖ పారిశ్రామికవేత్త

## జాక్‌పాట్ కొట్టాలన్న ఆశ

మాగుంట సుబ్బరామిరెడ్డి పూజా కార్యక్రమాలు నిర్వహించడం, శివాజీగణేశన్ సతీ సుత సమేతంగా విచ్చేసి, కెమెరా స్విచ్ ఆన్ చేయగా, ఆయన పుత్రుడు తమిళ హీరో ప్రభు ముహూర్తపు షాట్‌కు దర్శకత్వం వహించడం, చిరంజీవి తొలి క్లాప్ కొట్టడం ఎంతో ఆడంబరంగా జరిగాయి. "తాలాట్టు కేక్కుదమ్మా" అనే తమిళ హిట్ చిత్రం ఆధారంగా, భారీ ఎత్తున

కొరవ 9 పేజిలో

# బేబీ షామిలికి బేబి శ్రీదేవి పోటీ

మూడేళ్లయినా నిండకమునుపే పారితోషికం లకారం దాటిన బాలతార షామిలి. తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ, హిందీ భాషా చిత్రాలలో ఈ పాప మరీ బిజీ అయిపోవడంతో నిర్మాతలకు దిక్కుతోచని పరిస్థితి ఏర్పడింది. ఇంతలో నటి మంజుల కూతురు బేబీ శ్రీదేవి ఒక తమిళ చిత్రంలో పరిచయమైంది. ఈ అమ్మాయి షామిలికి ఏ మాత్రం తీసిపోనని నిరూపించుకుంది. దీనితో అందరూ ఈ అమ్మాయి వెంట పడుతున్నారు. మొత్తంమీద షామిలికి పోటీగా శ్రీదేవి తయారైపోయిందిప్పుడు! పలు తెలుగు చిత్రాలలో బుక్ అయింది కూడా!

### "అంగరక్షకుడు"

డాక్టర్ రాజశేఖర్ కథ, స్క్రీన్‌ప్లే, సమర్పణలో తయారయ్యే గోల్డ్‌మైన్ ఫిలిమ్స్ చిత్రంలో ముఖ్యమంత్రి 'అంగరక్షకుడు'గా రాజశేఖర్ నటిస్తున్నారు. అక్టోబరులో షూటింగ్ పూర్తవుతుంది. రచన: పరుచూరి సోదరులు, సంగీతం: కీరవాణి; గీతాలు: వేటూరి; నిర్మాత: ఫారిస్, దర్శకుడు: జోషి.

## పులకరింపజేసే శృంగారం ఒళ్లు జలదరించే హింస

# ప్రేమ శిఖరం

చిత్రసమీక్ష

గుడ్లూరు గోపాలరావు

చిత్రం పేరే చెప్తూ వుంది ఇది ఒక ప్రేమ కథా చిత్రమని. ఈ ప్రేమ కథలో కొత్తదనమనేది లేదు. కొత్తదనం లేకపోయినా కొత్త దర్శకుడు సత్య అందరినీ ఆకట్టుకునే పద్ధతిలో కథను మలిచాడు. కుర్రకారును ఈ చిత్రం బాగా ఆకర్షించేట్టు చేశారు. అందుకోసం మనసును పులకరింపజేసే శృంగారాన్ని మితి మించి పాదిగాడు; ఒళ్ళు జలదరింప జేసే ఫైటింగులు మోతాదును మించి గుప్పించాడు. కుర్రకారుకు కావలసింది ఇవే కదా అని దర్శకుడు ఈ రెండు అంశాల మీద తన పనితనం చూపి వాటిని చిత్రంలో ప్రత్యేక ఆకర్షణలుగా నిలిపినట్లున్నాడు. ఈ రెండు అంశాలే చిత్రం విజయానికి బాగా ఉపకరించాయి.

హీరో ప్రశాంత్ (ప్రశాంత్) హీరోయిన్ ప్రీతి (నూతన నటి మమతా కులకర్ణి) విలన్ (నూతన నటుడు అరుణ్ పాండ్యన్) ఈ ముగ్గురూ చిత్రంలో ప్రముఖ పాత్ర వహిస్తారు. ప్రత్యేకించి ప్రేక్షకుల హృదయాల్లో నిలిచి పోతారు. హీరో, హీరోయిన్‌లు కుర్ర వయసులో వున్నవారు. చూడముచ్చట గొల్పుతున్నారు. వారి నటనా మెచ్చుకోతగిన స్థాయిలో వుంది. ముఖ్యంగా ఈ కుర్రజంట సినిమా స్కోప్ కలర్‌లో జోరు జోరుగా చేసిన శృంగార నృత్యాలు చాలా ఆసక్తి కరంగా వున్నాయి. అలాగే విలన్ ఆంథోని ప్రేమజంటను కలపటం కోసం, షేర్‌ఖాన్ (రామిరెడ్డి) అనే గూండాతో చేసిన ఫైటింగులు, గునపంతో షేర్‌ఖాన్‌ను పొడిచిచంపటం, అంతకు ముందు షేర్‌ఖాన్, మానస (సితార) అనే జర్నలిస్టును అండర్ గ్రౌండ్ సదివిలో ఒక పథకం ప్రకారం వెంటాడి హత్య చెయ్యటం – వీటిలో వయొలెన్సు విపరీతంగా, క్రూరంగా, ఘోరంగా వున్నా గొప్ప థ్రిల్ కలిగించి ప్రేక్షకులను ఉక్కిరి బిక్కిరి చేస్తాయి.

విలన్ ఆంథోని పాత్రలో అరుణ్ పాండ్యన్ చూపిన నటన, చేసిన ఫైటింగులు, ముఖ్యంగా పతాక సన్నివేశపు ఫైటింగ్సులో అతను ప్రదర్శించిన నేర్పు వల్ల "అబ్బా" – ఫైటింగ్సు అని అంటారు అందరూ. షేర్‌ఖాన్‌గా రామిరెడ్డి కూడా అదే స్థాయిలో ప్రతిభ చూపాడు.

శృంగార దృశ్యాలను, ఫైటింగు ప్రదర్శనలను చిత్రీకరించటంలో మధు అంబట్ కెమెరా తన ఉన్నత సాంకేతిక నైపుణ్యాన్ని చాటుకుంది. అలాగే మనోజ్ నేపథ్య సంగీతం అన్ని సన్నివేశాలకు బలం కూర్చింది.

చిత్రం ప్రథమ భాగమంతా, హీరో, హీరోయిన్ ప్రేమించుకోవటం, కలహించుకోవటం, మరలా కలిసిపోవటం, ఆడటం పాడటాలతో ఆహ్లాదకరంగా సాగిపోతుంది. ఇక ద్వితీయ భాగంలో విలన్ ఆంథోని, గూండా షేర్‌ఖాన్‌ల రంగ ప్రవేశంతో వయొలెన్సు చోటు చేసుకుంటుంది.

ప్రశాంత్ సామాన్య కుటుంబీకుడు. ప్రీతి పెద్ద

కొరవ 9 పేజిలో

# చంటిని మించే చినరాయుడు

తమిళహిట్ చిత్రాలను తెలుగులో అందిస్తున్న యువనిర్మాత నెల్లూరీయుడు సి.ఎల్. నరసారెడ్డి "చామంతి" అనంతరం విడుదల చేయనున్న "చినరాయుడు" చిత్రం వసూళ్లలో "చంటి"ని మించిపోగలదని సినీ పండితుల అంచనా. ఆగస్టులో విడుదలయ్యే ఈ చిత్రంలో వెంకటేష్, విజయశాంతి, విజయలలిత, రజిత, నిర్మల, శాంతి, మోహన్‌రాజ్, దామరాజా, వినోద్, సి.ఎల్. నారాయణ ఆదిగా గలవారు పాల్గొన్నారు. మాటలు: పరుచూరి సోదరులు, సంగీతం: ఇళయరాజా.

జమీన్ రైతు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ. 100.00 |
| ఆరు నెలలకు | రూ. 50.00 |
| విడి ప్రతి | రూ. 2.00 |




## నోటీసు

యిందు మూలముగా, నెల్లూరు టవును, పొదలకూరు రోడ్డు, డోరు నెం. 25-1/675 వాస్తవ్యులు అను రావూరు వెంకటకృష్ణారెడ్డి గారి కుమారుడగు రావూరు వెంకట రమణారెడ్డి గారికి తెలియ చేయునదేమనగా

లోగా తే 10.2.1990 సంవత్సరమున మీరు నా పేరిటికి షెడ్యూలు ఆస్తిని విక్రయ అగ్రిమెంటు ద్వారా విక్రయము చేసి రూ. 3000/- అక్షరములా మూడు వేల రూపాయలు తీసుకొని, కొరవ క్రయధనము రూ. 500/- అక్షరములా అయిదు వందల రూపాయలు నేను చెల్లించవలసి యున్నది. నేను కొరవ క్రయధనము చెల్లించి షెడ్యూలు దాఖలా ఆస్తిని రిజిష్టరు చేసికొనుటకు మిమ్ములను ఎన్నో పర్యాయములు కోరి యున్నాను. మరియు తేది 22.7.1992 న మీకు రిజిష్టరు నోటీసు పంపినప్పటికీ మీరు దురుద్దేశపూర్వకముగా సదరు నోటీసు తీసుకొనక కాలయాపన చేయుచున్నారు. కావున మీరు 14.8.1992 తేది ఆత్మకూరు సబ్ రిజిష్ట్రారు ఆఫీసులో వుదయము 10.30 గంటలకు హాజరై కొరవ క్రయధనము నా వద్ద నుండి తీసుకొని షెడ్యూలు ఆస్తిని నా పేరిటికి రిజిష్టరు చేసి యివ్వవలసినది. లేని ఎడల మీపై వ్యాజ్యము వేసి కలుగబోవు కష్టనష్టములకు మీరు బాధ్యులగుదురు.

### షెడ్యూలు

నెల్లూరు రి.డి. యిలాకా ఆత్మకూరు సబ్ రి.లో చేరిన వరికుంటపాడు గ్రామ పంచాయితీ, వరికుంటపాడు గ్రామ పొలం. P.No. 102 రు దాఖలా కొరుమెట్ల S.No. 18/1 లోని య 3.97 సెంట్లకు హద్దులు.

తూ: చల్లా వెంకటస్వామి, మావిళ్లపెన్న కృష్ణయ్య గార్ల భూములు; ద: కొడవర్తి సుబ్బారాయుడు,లింగాల ఓబులేసు గార్ల భూములు; ప: రావులింది సుబ్బారెడ్డి, బోడా పెంచలయ్య గార్ల భూములు; ఉ: మళ్ల నరసయ్య, ఒగ్రెడ్డి శేషయ్య వగైరాల భూములు.

యీ హద్దుల లోని సమష్టిన వున్న య 2.00 సెంట్లు లోని సమిష్టిన నీకు విక్రయ ఖరారు పరచిన య. 1.00 ట్లు (ఒక్క ఎకరా) భూమిని యిందుకు సంబంధించిన మామూలు రాకపోకల యావత్తు యీజిమెంటు హక్కులతోటి నీకు విక్రయ ఖరారు పరచదమైనది.

సన్నపురెడ్డి వెంకటరెడ్డి

హోటలు సింహపురి,

రైల్వేస్టేషను రోడ్డు,

నెల్లూరు - 524 002.

# శివారెడ్డి పద్యాలు

### సత్యానందమహర్షి

సత్యానందమహర్షి!
సత్యము నీసేవ మోక్షనిలయానికి
అత్యున్నత శ్రేయోపదమది
సత్యము, యిద్దానికెరు సాక్ష్యంబిల్ల

### రేబాల

రెట్టమతపు కవిని రేబాల చారిత్ర
తెనెలొలుకు స్టోరి తెరుచొస్తె
ఒప్పుతప్పులెన్ని ఉండిచ్చు
మంచి చెడ్డ చెప్పు మనవి జిస్తి!

### ఆంధ్రముఖ్యమంత్రి

ఆంధ్రముఖ్యమంత్రి ఆరాధ్యదైవమ్ము
ఆదిక వింధు వారి ఆగమనము
నిన్న నేడు గూర నెల్లూరు జిల్లాకు,
నిజము దాస్తె పెద్ద నేరమాద్రి!

### పెళ్లకూరు రామచంద్రారెడ్డి

### (ఇఫ్కో ఛైర్మన్)

నీతి నిష్టమెందు నెల్లూరు జిల్లాలో
ఎల్లరెంగి నేడు పెళ్లకూరు
వచ్చి వచ్చి తిరిగి పోక యింటివాడాయె
కోరలేదు పుట్టు క్రొత్తపదవి!

### తాగూరు వర్ధంతి

వీగి దేహయాత్ర తాగూరు మృతిబొంది
యింతలోనే ఏబై యేళ్లుగడిచె
ఇంతటోడు పుట్టడిప్పట్లో యికమీద
భరతగడ్డపై! ప్రతిది తెలుసుమీకు

### బెజవాడ గోపాల్‌రెడ్డి

ఏమి జిస్తె తమకు ఎన్ని సన్మానాలు
యిచ్చి
సత్కరిస్తె ఎంత జిస్తె
ఈ మా నెల్లూరు పురవరమ్ము
పొగడ తరమె నిన్ను

### జాయింట్ కలెక్టర్

ఉప్పొంగితులేసి పుప్పొంగి పోతాడు
కళ్ళ గప్పుతాడు కవితలంటె
కవిని బోతె కాఫీచుక్క యిచ్చిందిలె
ఆఫీసర్లు యిప్పుడందరంతె!

### వేమారెడ్డి జానకి రామిరెడ్డి

హెల్తుస్పాయిల్లైంది ఈ మధ్య పెళ్ళిళ్ల
కెళ్లడంల ప్రాప్తమెది గూర
లేకపోతె చేద నాకు వేమారెడ్డి
కాఫీ ఉప్మా . టైము కలసిరాల!

### మాతృ మూర్తి

పార్థసారథి ధర్మపత్ని శ్రీవనమాలి
మాతృమూర్తి తృటిలో మాయమాయె
సాధ్వి రుక్మిణమ్మ సాగెతా దివికి
వార్తవిన్న గుండెవ్రయలాయె?
పొయ్యినోరు తిరిగి పుట్టేదాయిక లేదు
కూడు నీళ్ళ మాని కుమిలి కుమిలి
ఎవరు చేసెదింక ఏముంది వనమాలి
వున్న నిజము నీకు అన్నిదెలుసు!

### శుభలేఖలు

కల్లుపొరలు, అష్టకష్టాలు బరుతుంటె
కదలలేక నాటుకవిని నేను
లేని పోనిఖర్చు చేసిగ్గ, శుభలేఖ
లెందుకండి . దీంతో ఏమవుద్ది!

# రైతులోకం

(4 పేజీ కొరవ)

ఈ సూక్ష్మ జీవుల పెరుగుదలకు గాలి, తేమ దాదాపు చెరి 50శాతము వుండాలి. కర్బనము, నత్రజని, నిష్పత్తి 20 నుంచి 30 : 1 గా వుండాలి.

2. కంపోస్టు తయారీలో రసాయనాలు సేంద్రియ పదార్థాలను అతి విలువైన సేంద్రియ ఎరువుగా మార్చడంలో కీలక పాత్ర వహిస్తాయి.

3. కంపోస్టు తయారీలో కొన్ని రసాయన పదార్థముల స్టార్టర్లు గా వాడుతారు. అవి అమ్మోనియం సల్ఫేటు, యూరియా, రాక్ ఫాస్ఫేటు, అమ్మోనియం ఫాస్ఫేటు, ఎముకల పొడి, బూడిద మొదలయినవి. సూక్ష్మ జీవుల ప్రక్రియ సమర్థవంతంగా వుండాలంటె 0.1 నుండి 1.0 శాతము వరకు నత్రజని కావాలి. అవసరమయితే 0.3 నుండి 0.5 శాతం సున్నము కూడా ఉపయోగించాలి.

4. కంపోస్టు తయారీలో అవసరమైన సూక్ష్మ జీవులను పుట్టించుటకు ఆవు లేక గేదె పేడ, పశు మూత్రము, పశు మూత్రంలో తడిసిన మన్ను మొదలగునవి చాలా అవసరం. ఇవి కుళ్లబెట్టె ప్రక్రియను ఉధృత పరుస్తాయి. కంపోస్టు ఎరువును తయారు చేయడంలో చాలా పద్ధతులున్నాయి. కాని గ్రామీణ రైతాంగానికి అనువైన, అందుబాటులో వున్న సులభమైన పద్ధతిని గురించి విపులంగా తెలుసుకొందాము.

గ్రామీణ కంపోస్టును తయారు చేయుట

ఈ కంపోస్టును తయారు చేయుటకు 3 అడుగుల లోతుగల గుంటను త్రవ్వాలి. గుంట అంచులు ఏటవాలుగా వుండాలి. గుంట పొడవు, వెడల్పు మనకు లభించే సేంద్రియ పదార్థాల పరిమాణమును బట్టి ఉంటుంది. ఒక గుంట కంటె ఎక్కువ గుంటలను త్రవ్వేటట్లయితే వాటి మధ్య దాదాపు 12 అడుగుల దూరం వుండాలి. ఎందుకంటె ఎరువును తిరుగ త్రిప్పుకొనుటకు ఆ స్థలము అవసరము. పొడువైన గుంటను త్రవ్వకుంటె దానిని అంచెలంచెలుగా నింపుకొనవచ్చు. ఒక్కొక్క సారి 6 అడుగుల పొడవు 5 అడుగుల వెడల్పు గల పరిమాణము గుంటలను నింపుకొన వచ్చు. అందువలన ఆ ఎరువును తిరగ త్రవ్వుటకు అనుకూలముగా వుంటుంది. కావలసిన తేమను, గాలిని అందచేయ వచ్చు. ముఖ్యముగా ఈ కంపోస్టు గుంటలను పల్లెలకు దూరముగా వుంచాలి. అందువలన దుర్గంధమును తప్పించు కొనవచ్చు.

### కంపోస్టు తయారీ పద్ధతి

1. కంపోస్టు గుంటను పొరలు పొరలుగా నింపాలి. పొరయొక్క మందము మనమునింపే పదార్థముల పై ఆధారపడి వుంటుంది. వేసే పదార్థములు బాగా చెమ్మ కలిగిన పచ్చి ఆకులయితే 12 అంగుళముల వరకు ఒక పొరగా వేయవచ్చును. గట్టి చెక్క వంటి పదార్థములయితే 3 అంగుళముల మందము వరకు మాత్రమే ఒక పొరను వేయాలి.

2. ఎముకల పొడినిగాని, బూడిదను గాని లేక సూపర్ ఫాస్ఫేటును గాని ఆ పొరపై చల్లాలి. అట్లు చేయుటవలన పదార్థములు కుళ్లినప్పుడు విడుదలయ్యే సేంద్రియ ఆమ్లములను అదుపులో పెట్టవచ్చును. అంతేగాకుండా పంటకు కావలసిన భాస్వరమును, సున్నమును ఎరువు ద్వారా అందజేయ వచ్చును.

3. ఆ తరువాత పేడ నీటిని దానిపై చల్లాలి. అందువలన ఆ పదార్థాలపై సూక్ష్మ జీవులచే క్షయీకరణ మొదలవుతుంది.

4. పై విధముగా పొరలను భూమిపై దాదాపు 3 అడుగుల వరకు వేయాలి. ప్రతి పొరపై స్టార్టరును వేసి పేడ నీటిని చల్లాలి.

5. అప్పుడప్పుడు ఈ దిబ్బలను తిరగ త్రిప్పవలయును. అందువలన కంపోస్టు తొందరగా తయారవుతుంది. 12నుండి 15 రోజులలో దిబ్బ ఎత్తు 3 అడుగుల నుండి 1 అడుగు తగ్గుతుంది. అప్పుడప్పుడు దానిని తిరగ దోడడం మంచిది.

7. పై విధముగా చేసిన దాని వలన కంపోస్టు ఎరువు 3 నెలలలో తయారవుతుంది. ఒక వేళ గట్టి చెక్క లేక నార పదార్థమయితే దాదాపు ఒక సంవత్సరము పట్టవచ్చు.

8. కంపోస్టు దిబ్బలను త్రవ్విన వెంటనే పొలములో వేసి కలయ దున్నాలి. లేకుంటె ఎరువు లోని నత్రజని నష్టమవుతుంది. చాలా రోజుల వరకు వుంచాలంటె దిబ్బపై బాగా మట్టిని కప్పి వుంచాలి.

పై విధముగా గ్రామీణ ప్రాంతాలలో కంపోస్టును తయారు చేసినట్లె పట్టణ ప్రాంతాలై మున్సిపాలిటీలు, కార్పొరేషన్‌లలో కూడా కంపోస్టు ఎరువును తయారు చేస్తారు. ఎరువును తయారు చేయుటకు మున్సిపాలిటీ చెత్తను ఉపయోగిస్తారు. మానవ విసర్జనాలను స్టార్టరుగా ఉపయోగిస్తారు. పొరల మధ్యలో పొడి చేయబడిన మైలు తుత్తమును చల్లుతారు. ఇలా చేయుట వలన దుర్వాసన తగ్గుతుంది. మానవ విసర్జనాలను, చెత్త చెదారాలను 1:4 నిష్పత్తిలో కలిపి పొరలుగా చేసి ప్రతి 400 కిలో గ్రాములకు ఒక కిలో గ్రాము మైలుతుత్తము చల్లాలి. ప్రతి 15 రోజులకు దిబ్బలపై నీరు చల్లికలియబెట్టాలి. దాదాపు రెండు నెలలలో ఎరువు తయారవుతుంది. అధిక ధరలతో లభ్యమవుతున్న రసాయనిక ఎరువులను కొనలేక నలుగుతున్న రైతాంగం కంపోస్టు ఎరువు తయారీలో దృష్టికేంద్రీకరించి తక్కువ ఖర్చుతో అధిక దిగుబడులు పొందవచ్చు.

# సింహపురి

(4 పేజీ కొరవ)

### విఆర్‌కాలేజి

## విద్యార్థిని ప్రతిభ

వెంకటేశ్వర విశ్వవిద్యాలయం పరిధిలో బిఎస్‌సి పరీక్షలో నెల్లూరు విఆర్‌కాలేజి విద్యార్థిని శ్రీమతి జి. ప్రశాంతి డిస్టింక్షన్‌తో ఉత్తీర్ణురాలైంది. బిఎస్‌సి ఎంపిసి ఇంగ్లీషు మీడియంలో ఆమె మంచి మార్కులు సాధించింది.

ప్రశాంతి - కాలేజి ఫిజికల్ డైరెక్టర్ శ్రీ జి. దయాకర రెడ్డి కుమార్తె.

## 'వాత్సల్య' పిల్లలపై వాత్సల్యం చూపండి

అభాగ్యులు, అనాధలైన పిల్లలను చేరదీసి, వాత్సల్యం చూపి విద్యనేర్పి పెంచడానికి ఏర్పాటైన ' వాత్సల్య' అనాధ పిల్లల స్కూలులో జూలై 26 తేది 'పోషకుల దినోత్సవం' జరిగింది. స్టాండర్డ్ ప్యాకేజింగ్ రాధాకృష్ణ కుటుంబీకుల నిర్వహణలోని ఈ స్కూలులో అనాథ పిల్లలకు సర్వ సౌకర్యాలూ సమకూరుస్తారు. ఈ సేవా కార్యక్రమాన్ని మరింత సమర్థవంతంగా నిర్వహించడానికి టౌన్‌లోని పెద్దలు మానవతా దృక్పథంతో సహాయ పడాలని కమిటీ కోరుతున్నది.

ఒక పిల్లవాడిని ఎంపిక చేసుకొని పూర్తి పెంపకం బాధ్యత స్వీకరించ దలచినవారు, లేదా స్కూలులోని పిల్లలందరికీ చదువు, వృత్తి విద్యలలో శిక్షణ ఇప్పించేందుకు సిద్ధపడేవారు లేదా పిల్లలందరికీ వైద్య పరీక్షలు జరిపించాల నుకునేవారు శాశ్వత ప్రాతిపదికన 20 వేలు; ప్రతి ఏటా ఒక పిల్లవాడి సంరక్షణ బాధ్యత స్వీకరించదలిస్తే 5 వేలు విరాళంగా ఇవ్వవచ్చు. పుట్టిన రోజుల వంటి సందర్భాలలో కాని, ఇతరుల స్మృతంకంగా గాని ఏడాదిలో ఒక రోజు భోజనం పెట్టదలిస్తే రెండు వేలు చెల్లించవచ్చు.

ఫర్నిచరు, పుస్తకాలు, వాడిన గుడ్డలు, ఆట బొమ్మలు, పరికరాలు ఇచ్చినా తీసుకుంటారు. అన్ని విరాళాలకూ ఇన్‌కంటాక్స్ మినహాయింపు లభిస్తుంది. వివరాలకు సెక్రటరీ, జనహిత, 20, రాఘవ అపార్ట్‌మెంట్స్, టెక్కేమిట్ట, నెల్లూరు - 4 అన్న చిరునామాకు వ్రాయండి!

# పంచాంగము

### శ్రావణపౌర్ణమ

తేది 13 గురువారము శ్రావణపూర్ణిమ

తేది 15 శనివారము భారత స్వాతం త్రదినోత్సవము

### ముహూర్తములు

తేది 9 ఆదివారము ఉదయం 7.45 గంటలకు సింహలగ్నమున వ్యాపారారంభ వివాహములకు

తేది 12 బుధవారము ఉదయం 7.30 గంటలకు సింహలగ్నమున వ్యాపార వివాహములకు

తేది 13 గురువారము ఉదయం 9.10 గంటలకు కన్యాలగ్నమున గృహారంభ, వ్యాపార, వివాహములకు

రాత్రిగంట 11.20 లకు మేషల్న గృహప్రవేశ వివాహములకు

తేది 14 శుక్రవారము ఉదయము 7.25 గంటలకు సింహలగ్నమున గృహారంభ వ్యాపార వివాహములకు రాత్రి 11.15 గంటలకు మేషలగ్నమున గృహప్రవేశ వివాహ ములకు సుము హూర్తములు కలవు.

### శ్రావణ మాస శుక్ల పక్ష

తిథులు

| | | |
|---|---|---|
| తే 8 | శని దశమి ఉ.గ. | 8.20పె |
| తే 9 | ఆది ఏకాదశి ఉ.గ. | 8.40 ప |
| తే 10 | సోమ ద్వాదశి ఉ.గ. | 9.30ప |
| తే 11 | మంగళత్రయోదశిఉ.గ. | 10.45ప |
| తే 12 | బుధ చతుర్దశి ప.గ. | 12.23ప |
| తే 13 | గురు పూర్ణిమ | 2.20 ప |
| తే 14 | శుక్ర పగ లు | 4.20 ప |

స్వయంపాకుల శ్రీనివాసులు

ఎం.ఏ

## సణుగుడు

4 పేజి కొరవ

క్షేత్రంలోనే కంట్రాక్టర్లకు శ్రమ తప్పకుండా వెళ్లివే వందలాది కోట్ల బంగ క్లెయిమ్‌లతో సంవత్సరానికి పాతిక ఇంజనీరింగ్ కాలేజీలు తెరవవచ్చు; కాని ప్రభుత్వం ఆ పని చేయదు- కంట్రాక్టర్లను మాత్రం ఉదారంగా పోషిస్తుంది; కమర్షియల్ ట్యాక్సేషన్‌లో వ్యాపారుల కిచ్చే రెమిషన్లు, వ్యాపారులు ఎగ్గొట్టే పన్ను మొత్తాలతో ఊరికొక డెంటల్ కాలేజి తెరుచు కుంటూ పోవచ్చు- కాని ప్రభుత్వానికది ఇష్టం లేదు; వ్యాపారి లాభార్జనే దాని కానందం. ఈ వ్యవస్థ తీరే అంత. అందుకు ఎవర్ని నిందించీ లాభం లేదు.

ఇటు ప్రభుత్వం కాలేజీలు పెట్టక, అటు ప్రైవేటు కుబేరులనూ పెట్టనివ్వక పోతే చదువుకోవాలనే కోరికుండే ప్రజల గతేమిటి?

అదీ ఈ వ్యవస్థ సహజ లక్షణమే. ప్రభుత్వంలో వుండే పార్టీ అప్పుడప్పుడు కొన్ని 'మంచి' పనులు చేసి, ప్రజల మెప్పుపొందితే ప్రతి పక్షాలకు కష్టం. రేపు ఎన్నికల్లో వారికి ఓట్లు ఖాళీ! సీట్లు ఖాళీ! అందుకే ప్రభుత్వం ఎప్పుడూ 'తాపెట్టదు అడుక్కు తిన్నివ్వదు' అన్నట్లు మాత్రమే వ్యవహరించేటట్లు ప్రతిపక్షాలు జాగ్రత్త పడుతుంటాయి. ప్రజలకుపయోగపడే పని జరుగుతుందని అనుమానం వస్తే మహా ఆవేశంతో ముందుకురుకుతాయి. కోర్టుల కెక్కి, ఉద్యమాలు చేసి, రచ్చలు సృష్టించి, ఆ రావిళ్లలో కొందరు ప్రజలను పోలీసు తుపాకీలకు బలిచేసి మరీ అడ్డుకుంటాయి. ప్రైవేటు కాలేజీలు పెడితే పోటీలు పడి కోర్టుల కెక్కుతున్న ప్రతిపక్ష నేతలు ఎప్పుడైనా, ఏ ఒక్కసారైనా ప్రభుత్వ ఖజానా నుంచి కంట్రాక్టర్లకూ, వ్యాపారులకూ చేరుతున్న ధనప్రవాహాన్ని ఆపమని కోర్టులకెక్కినట్లు విన్నావా? ఒక్క పన్ను ఎగవేతనో, టెండర్ల కుంభకోణాన్నో కోర్టుల దృష్టికి తీసుక వెళ్లిన సంగతి కన్నావా? ప్రతిపక్షం కోపం ప్రభుత్వంలో ఉండే పార్టీపైనే కాని, ప్రభుత్వ నిధులతో పెరిగే వ్యాపారులపై కాదు. వారికొచ్చే డబ్బుకు బ్రేకేస్తే రేపు ఎన్నికల్లో తమకొచ్చే విరాళాలు కృశించి పోతాయి. అందువల్ల ఇరుపక్షాలూ ఆ వర్గాలను కంటికి రెప్పలాగా కాపాడుకుంటాయి. ప్రజలకు సౌకర్యాలు కల్పిస్తేనే ఆ పార్టీలకు నష్టం.

ఆ వర్గాల దగ్గరున్న సొమ్ము ప్రజలదే అయినపుడు, దానిలో కొంత ప్రజలకు ఖర్చు పెట్టలేరా? డొనేషన్లు లేకుండా ప్రైవేటు కాలేజీలు నడపలేరా?

వ్యాపారి ఏ పనీ లాభం లేకుండా చేయదు. మెడికల్ కాలేజి పెట్టాలంటే ముందు కనీసం నాలుగైదు కోట్లు కావాలి. అది పెట్టుబడి; కాలేజి పెట్టినప్పటినుంచి మనం కట్టే సొమ్ముతో బిల్డింగులు కడతారు, అయ్యవార్లకు జీతాలిస్తారు; అది టర్నోవరు; రెండేళ్లు తిరిగే సరికి డొనేషన్ల లాభం, జీతాల ఖర్చు బ్రేక్ ఈవెన్ అవుతాయి. ఆ దశలో పెట్టుబడి రికవరీ ప్రారంభం అవుతుంది. ఆ తర్వాత నుంచి వచ్చేదంతా లాభం; వ్యాపారికి తనకున్న వ్యాపారాలకు ఇంకొకటి జత అవుతుంది- దానిపై ఏటా లాభం వస్తుంటుంది. - కాలేజి పెట్టి చదువు చెప్తున్నాడన్న మంచి పేరు మిగులుతుంది. - ప్రజలు మెచ్చుకుంటారు. ఇది బోనస్. ఈ క్రమంలో ఏ ఒక్కటి మిస్ అవుతుందని సందేహం కల్గినా వ్యాపారి ఆ దరిదాపులలో కన్పించడు; కన్పిస్తే, అతడు వ్యాపారి కాడు!

అంత నిక్కచ్చిగా లాభనష్టాలు చూసుకొనేవారు - కాలేజిల ద్వారా తాము ప్రజల కిరో సేవ చేయబోతున్నామన్న పోజులు కొట్టి, ప్రచారం చేసుకోవడం దేనికి?

ఒక దశ వరకు డబ్బు సంపాదించిన తర్వాత ఆ ఆర్జనతో తృప్తి గల్గదు; అంతకు కు మించినదేదైనా కావాలి. అటువంటి మానసిక తృప్తి కల్గించేదే ప్రచారం. పదిమంది తనను గుర్తించి , గౌరవించాలని, తాను చేసే పనులు నలుగురి దృష్టికి పోవాలని ప్రతి వ్యాపారీ ఒక దశ దాటిన తర్వాత ఉబలాటపడ్తారు. అటువంటి మనస్తత్వాలకు మంచి మందుగా ఉపకరిస్తున్నాయి ఈ మెడికల్ కాలేజీలు. ప్రచారం పాటికి ప్రచారం, డబ్బు పాటికి డబ్బు వస్తున్నప్పుడు ఎవరికి చేదుఒ

వీటివల్ల ప్రజలకు ఏ ఉపయోగం వున్నా, లేకున్నా వర్తమాన రాజకీయ. వ్యాపార ప్రపంచపు పోకడలు అర్థం చేసుకోవడానికి మాత్రం బాగా పనికివస్తున్నాయీ మెడికల్ కాలేజీలు.

## అంత్యోత్సవమే

(4 పేజి కొరవ)

భక్తి గౌరవాలు కలిగిన వాళ్ళు ఎందరో తమ బిడ్డలకు వారి పేర్లు పెట్టుకోవడం ఆనవాయితీగా వస్తున్నది. స్వాతంత్ర్యోద్యమంలోను, తర్వాతి కాలంలోను ఎందరో గాంధీలు, బాలగంగాధరులు, సుభాష్‌లు మన మధ్యన పుట్టారు. అయితే శ్రీరాములు గారి విషయంలో మాత్రం ఆయన అభిమానులమని చెప్పుకొనే వారెవరైనా తమ పేర్లు మార్చుకొన్నారా, లేక తమ బిడ్డలకు శ్రీరాములు గారి పేరు పెట్టుకొన్నారా! లౌడ్‌స్పీకర్ లో అరచి చెప్పవచ్చు -లేదు, అని! అటువంటప్పుడు 1400 సంవత్సరాల చరిత్ర గల నెల్లూరు జిల్లా పేరెందుకు మార్చాలి?

ప్రస్తుతం అన్నిటిలోనూ ఏకాభిప్రాయసాధన అని కలవరిస్తున్న ప్రభుత్వం ఈ విషయంలో మాత్రంపరియైన చర్చలేకుండా తల దూర్చడం శోచనీయం. ఈ మార్పుకు జిల్లా ప్రజలు సుముఖులు కారని స్పష్టంగా చెప్పవచ్చు. దేశంలో పొద్దున లేచి సామాన్యుడు ఎదుర్కొనే సమస్యలను పరిష్కరించడానికి రావలసిన మార్పులు చాలా వున్నాయి. వాటిని వదలి అనవసర పేరుమార్పులకు అక్కర ఏమిటి?

ఒక వేళ పేరు మార్పు తప్పదు అన్నప్పుడు "నెల్లూరు జిల్లా ద్విశతోత్సవాలు" అనే పేరు మార్చి నెల్లూరు జిల్లా "అంత్యోత్సవాలు" అంటే సముచితంగా వుంటుంది గదా! నెల్లూరు జిల్లాయే లేనప్పుడు నెల్లూరు జిల్లా ద్విశతాబ్దితోత్సవాలేమిటి?

జిల్లాలోని మేధావులు మేధావులమని చెప్పుకొనే వాళ్ళు ఈ మార్పును గురించి హేతుబద్ధంగా ఆలోచించ గలరని ఆశిద్దాం. ప్రభుత్వాన్ని తొందరపడ వద్దని జిల్లావాసులమంతా కోరుదాం.

## సినిమా

(7 పేజీ కొరవ)

నిర్మింపబడే ఈ ప్రతిష్ఠాత్మక చిత్రంలో మోహన్‌బాబు సరసన దివ్యభారతి - పూజాబేడీ నాయికలు. జగ్గయ్య, బాబూమోహన్, కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం, మోహన్‌రాజ్, వై. విజయ, వరలక్ష్మి ఇతర పాత్రధారులు. మాటలు: పరుచూరి సోదరులు; పాటలు: జాలాది, రసరాజా, గురుచరణ్; సంగీతం: కె.వి. మహదేవన్; ఛాయ: ఎం.వి.రఘు; సుపమ సమర్పించే ఈ చిత్రం వచ్చే జనవరిలో సంక్రాంతి కానుకగా విడుదలవుతుంది.

## "అమ్మోరు" ప్రారంభం

మల్లెమాల సుందరరామిరెడ్డి సమర్పణలో, ఆయన తనయుడు ఎం. శ్యామ్‌ప్రసాదరెడ్డి నిర్మిస్తున్న ఎమ్మెస్ ఆర్ట్ మూవీస్ "అమ్మోరు" చిత్రం తూర్పుగోదావరి జిల్లా ముక్తేశ్వరం తాలూకాలోని 'అయినవల్లి లంక' గ్రామంలో జరిగింది. సురేష్, సౌందర్య, చిన్నా, బాబూమోహన్, కళ్ళు చిదంబరం, నాగమణి, లక్ష్మి, రవీంద్రరెడ్డి, శరత్, బేబీ సునయన పాత్రధారులు. పాటలు: మల్లెమాల, రసరాజా; సంగీతం: చక్రవర్తి; దర్శకత్వం: వై. రామారావు. ఛాయ. వి.ఎస్.ఆర్. స్వామి. అక్టోబరు 1న విడుదల చేయాలని నిర్మాత సంకల్పం.

## చిత్రసమీక్ష

(7 పేజీ కొరవ)

కుటుంబీకురాలు. తన కూతురు ప్రీతి ఒక సామాన్యుణ్ణి ప్రేమించటం తండ్రి (రంగనాథ్)కి ఇష్టం లేదు. గూండాలతో ప్రశాంత్ ఇంటిపై దాడి చేయిస్తాడు. ప్రశాంత్ నాయనమ్మ (నిర్మల) చనిపోతుంది. తన స్నేహితులతో ప్రశాంత్, ప్రీతి తండ్రి పై దాడి చేయిస్తాడు. ఒక రాత్రి ప్రీతి, ప్రశాంత్ పారిపోతారు. వారికి ఆంథోని ఆశ్రయమిచ్చి వారి పెళ్ళి జరిపిస్తానని హామీ కూడా యిస్తాడు. తాను ప్రేమించిన మానసను షేర్‌ఖాన్ పగ బూని చంపటంతో, ఆంథోని భగ్నహృదయుడై వుంటాడు. ప్రేమ విలువ తెలిసిన వాడు కావటంతో ప్రీతిప్రశాంత్‌లకు సహాయపడతాడు. ప్రీతితండ్రి తనను చంపేందుకు పంపిన గూండాలను, షేర్‌ఖాన్‌ను హతమారుస్తాడు ఆంథోని; చివరన ప్రీతి, ప్రశాంత్‌ల వివాహం జరిపిస్తాడు.

రంగనాథ్, నిర్మల, సితార, కామెడీకి వుపయోగ పడ్డ బ్రహ్మానందం, బాబూమోహన్, సుధాకర్‌లు కూడా బాగా నటించారు.

జంధ్యాల మాటలు, వేటూరి, సిరివెన్నెల పాటలు బాగున్నాయి.

## జనవాణి

(3 పేజి కొర వ)

నుంచిగాని, బాధ్యత గల స్థానాల్లో ఉన్నవారినుంచి గాని ఏ విధమైన నిరసన, కనీసం ప్రస్తావన రాకపోవడం ఆ మహాత్ముడికి మనం కూడా అవమానం చేసినట్లు అవుతుంది.

బాధ్యత గల ఖద్దరు ధారులు, రాజకీయ గంజాయి వనంలో అక్కడక్కడా ఉన్న తులసి మొక్కల వంటి నాయకులు సైతం పట్టించు కోక పోవడం దురదృష్టకరం. ఇప్పటికైనా సౌత్ ఆఫ్రికా అధికారులకు నిరసన తెలియ జేయడం గాంధేయులమని, గాంధి మా నాయకుడని చెప్పుకుంటూ, ఆయన పేరును వాడుకుంటున్న ప్రతి ఒక్క భారతపౌరుని కర్తవ్యం.

ఐ.వి.రఘురామమూర్తి

నెల్లూరు.

## పెన్నానదికి పేరు పెట్టండి!

నెల్లూరు ద్విశతాబ్ది ఉత్సవ నిర్వాహక కమిటీ సమావేశంలో నెల్లూరు జిల్లా పేరును పొట్టిశ్రీరాములు జిల్లాగా మార్చడానికి నిర్ణయం జరిగినట్లు పత్రికలలో రావడం విచారం కల్గిస్తున్నది. ఇది జిల్లాకు అన్యాయం చేయడమే. ఎంతో చారిత్రక ప్రశస్తి కల్గిన నెల్లూరు పేరును ఎందుకు మార్చవలసి వస్తున్నది? పొట్టిశ్రీరాములు గారు దేశానికి ఎంతో సేవ చేసింది నిజం; త్యాగాలు చేసిందీ నిజం; ఈప్రాంత ప్రజలతో మమేకం చెందినదీ నిజమై వుండవచ్చు. అయితే ఆ త్యాగాలకు గుర్తుగా, కృతజ్ఞతగా ఏ నదిపై కట్టే వంతెనకో, రోడ్డుకో, కట్టడానికో వారి పేరు పెట్టవచ్చు; లేదా వారి స్మృత్యంకంగా స్మారక మందిరంనిర్మించవచ్చు. వారి గుర్తుగా ప్రజోపయుక్తమైన కార్యాలకు పెద్ద భవనాలు కట్టవచ్చు. అంతే తప్ప, సమూలంగా జిల్లా పేరునే మార్చివేయడం, చరిత్రను అపహాస్యం చేయడమే అవుతుంది. ఈ రోజు అధికారంలో వున్న వారు ఒక నాయకుడి పేరుతో జిల్లా ఏర్పరచి, రేపు అధికారంలోకి వచ్చే ఇంకొక పార్టీ మరొక నాయకుడి పేరుతో జిల్లాలేర్పరచుకుంటూ పోవడం జరిగితే భావితరాలు మనల్ని క్షమించవు.

ముఖ్యమంత్రి ఈ విషయంలో త్వరపడి నిర్ణయం తీసుకోకుండా, పదిమంది అభిప్రాయాలు సేకరించడం అవసరం. ఉత్సవాల సందర్భంగా శ్రీరాములు గారిని సముచిత రీతిలో స్మరించాలనుకుంటే కలెక్టరేట్ బిల్డింగ్‌కో, పెన్నవారధికో ఆయన పేరు పెట్టడం బాగుంటుంది. చారిత్రక ప్రాధాన్యత గల ప్రాంతాల పేర్లను చీటికి మాటికి మార్చి ప్రజలను తికమక పెట్టవద్దని మనవి

బి. రాజశేఖర్

తోటపల్లిగూడూరు.

## ముఖ్యమంత్రిపై ఎందుకీ గలభా

పార్లమెంటు సభ్యులకు ముఖ్యమంత్రికి ఏమిటి సంబంధం? ముఖ్యమంత్రిని ఎన్నుకున్నది కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ; విశ్వాసం ప్రకటించ వలసింది శాసన సభ్యులు. మధ్యలో ఎమ్పీలెందుకు తలదూర్చడం? నిజంగా ముఖ్యమంత్రి పట్ల అయిష్టత వుంటే, మీటింగు పెట్టి, శాసన సభ్యుల చేత అవిశ్వాసం ప్రకటింపజేసి, దింపివేయవచ్చుగాని, ప్రతిరోజూ పత్రికలలో రచ్చలు, రావిళ్లు చేయడం దేనికి? ముఖ్యమంత్రి అవినీతి పరుడైతే అసలు మొదటే ఎందుకు ఎన్నుకున్నారు? ఇప్పుడు అవినీతికి పాల్పడుతుంటే కోర్టులలోనో, లోకాయుక్త దగ్గరో, అసెంబ్లీ లోనో సాక్ష్యాధారాలతో ప్రశ్నించ వచ్చుకదా! పత్రికలలో ఆరోపణలు క్రుమ్మరిస్తే ప్రజలకేమి మేలు? పార్టీకి ఏమి ప్రతిష్ఠ? ఏ అధికారో, పత్రికో ఒక శాసన సభ్యుడిపై ఆరోపణ చేస్తే ప్రివిలేజి తీర్మానం పెట్టి, సాధిస్తారే - మరి ముఖ్యమంత్రి శాసన సభ్యుడే కదా? ఆయనపై ఇంతటి అవాకులు చవాకులు ప్రేలేవారిపైన అసెంబ్లీలో హక్కుల తీర్మానం ఎందుకు పెట్టరు? మంత్రులూ అసంతృప్తి వాదులు కావడమేమిటి? నిజంగా మంత్రికి, ప్రభుత్వంపై విశ్వాసం లేకుంటే రాజీనామా పెట్టి ఇంటికి రావాలి తప్ప, కార్లు, బంగళాలు, హోదాలను మాత్రం అనుభవిస్తూ పత్రికలలో విమర్శలు చేయడం సిగ్గుచేటు కాదా?

నెల్లూరు — త్వరకవి



### నంద్యాల సబ్ జడ్జి కోర్టులో

SC 78/91

స్టేట్ బ్యాంక్ ఆఫ్ యిండియా, నంద్యాల -వాది

Vs

ముదినేని అరుణమ్మ హెణ్యం గ్రామము -ప్రతివాది

ప్రతివాది దావా సమన్ కొరకు 27.8.92 తేదిన వాయిదా వున్నది. ప్రతివాది పై తేదీ ఉదయం 10.30 గంటలకు పై కోర్టుకు హాజరై ఆక్షేపణలు తెలుపుకొనవచ్చును.

శ్రీ ఐ. గురుమూర్తయ్య

వాది అడ్వకేటు, నంద్యాల

### విజయవాడ 1st Adll. Sub Judge వారి కోర్టులో

EP 8/89 in O.S. 173/86

Between:

1. స్టేటు బ్యాంక్ ఆఫ్ ఇండియా కంచికచర్ల2. స్టేటు బ్యాంక్ ఆఫ్ ఇండియా ఇబ్రహీం పట్నం

DHR's - వాదులు

గింజాపల్లి హనుమయ్య S/o. గింజాపల్లి శీతయ్య నవాబుపేట, నందిగామ DMC

JDR -ప్రతివాది

పై నెంబరులో JDR తాలూకు DHr తనఖాకు లోబడియున్న దిగువ షెడ్యూలు దాఖలా స్థిరాస్తిని 7.9.92 తేది ఉ. 10.30 గంటలకు పై కోర్టు లో బహిరంగ వేలం జరుపబడును. కావలసిన వారు పాడుకొనవచ్చును.

### షెడ్యూలు

క్రిష్ణాజిల్లా నందిగామ సుబురిజిష్ట్రారు లో చేర్చి నవాబుపేట గ్రామం తాలూకు RSNo. 144/1 Ac 8-14 = 3256, Hcts

Full Extent (Dry Land)

వాదికిమ్మత్తు రూ. 17,000/-

అమీనా కిమ్మత్తు రూ. 25,000/-

దోర్నల రాధాక్రిష్ణమూర్తి

DHR Advocate

Vijayawada 27.7.92

జిల్లా వార్తలు

జిల్లా వార్తలు

జిల్లా వార్తలు

# ఎడారిగా మారుతున్న వెంకటగిరి అడవి

వెంకటగిరి అడవుల నుంచి తరలి పోతున్న అటవీ సంపదను గమనిస్తే - ఈ ప్రాంతమంతా ఎడారిగా మారడానికి ఎక్కువ కాలం పట్టబోదేమో అనిపిస్తుంది. ఎవరిష్టం వచ్చినట్లు వారు కన్నదిన చెట్టునల్లా నరికి కలప క్రింద మార్చి, అమ్మేసు కొంటున్నారు. ఎర్ర చందనం దుంగల స్మగ్లింగ్‌కైతే అదుపు, ఆజ్ఞ లేనే లేదు. నిత్యం కార్లలో, లారీలలో, బస్సులలో, లక్షలు విలువ చేసే ఎర్రచందనం తమిళ నాడుకు రవాణా అవుతూనే వుంది. అటవీ శాఖాధికారులు దాడులు చేస్తున్నప్పటికీ వంటూరు-స్మగ్లింగ్ మాత్రం ఆగడం లేదు.

మొన్నక రోజు వెంకటగిరి నుంచి మద్రాసుకు వెళ్లే ఆర్‌టిసి బస్సైన వేరు సెనగ కాయల బస్తా వేశారట. కండక్టరెందుకో చూడగానే అనుమానించి వచ్చింది. దానిని క్రిందకు దింపి, విప్పితే లోపలంతా ఎర్రచందనమే. ఆర్‌టిసి కంట్రోలరు వాటిని పట్టుకొని పోలీసుకు స్వాధీనం చేశారు. ఒక వ్యక్తిని అరెస్టు చేశారు.

మొన్న 1తేది ఉదయం శెంకోట అటవీ ప్రాంతంలో పొదలలో దాచి పెట్టివుంచిన 47 ఎర్రచందనం దుంగలు పట్టుకున్నారు. దుంగలు తప్ప, దొంగలు దొరకలేదు. వీటి విలువ 50వేలు. ఆ రోజు ఫారెస్టు ఆఫీసర్ల కళ్లు కప్పివుంటే, ప్రక్క రోజుకి మద్రాసు చేరిపోయి వుండేవి. అటవీ శాఖాధికారులు ఈ సమస్యను తీవ్రంగా తీసుకొని రాపూరు, వెంకటగిరి ప్రాంతాలలోని అడవులను కాపాడడానికి గట్టి ప్రయత్నం చేయకుంటే, మరో పది, పదిహేనేళ్లలో అక్కడ అడవే మిగలదు.

## ఇందుపూరు వివరణ

అల్లూరు మండలం ఇందుపూరు పాల సొసైటీలో వెన్నశాతం సరిగా తీయడం లేదని గతవారం ప్రచురించిన వార్తపై, సొసైటీ అధ్యక్షుడు శ్రీకె.రాధాకృష్ణారెడ్డి వివరణ పంపారు. సహకార సంఘానికి వచ్చే పాలన్నింటినీ ఎలక్ట్రానిక్ పరికరం ద్వారా పరీక్షించి, వెన్నశాతం లెక్కగట్టి, నమోదు చేస్తున్నామని, అన్నిటికీ రికార్డులు ఉన్నాయని, జిల్లాలోని సొసైటీలన్నింటిలోకి ఉత్తమ సంస్థగా పేరు తెచ్చుకొంటున్న తమపై దుష్ప్రచారం తప్ప వేరేమి కాదని చెప్తున్నారు రాధాకృష్ణారెడ్డి.

## కలిచేడు సదస్సు

సైదాపురం మండలం కలిచేడులో ఇండియన్ బ్యూరో ఆఫ్ మైన్స్ అధికారుల సదస్సు జరిగింది. సీతారామా మైకా గనిలో జరిగిన ఈ సదస్సులో దేశమంతటినుంచి వచ్చిన అధికార్లు పాల్గొన్నారు. శ్రీ అల్లారెడ్డి శ్యామసుందరరెడ్డి సదస్సునధ్యక్షించారు. వెంకటగిరి రాజా శ్రీ యాచేంద్ర, శ్రీ ఎం.ఆర్.రెడ్డి, శ్రీఎ. రంగారెడ్డి మాట్లాడారు. మైకా గనుల ఉత్పత్తి తగ్గి, గనులు మూత పడడానికి గల కారణాలను, గనుల యజమానుల కష్టనష్టాలను చర్చించారు. చర్చలు తప్ప, పరిష్కారానికి అధికారులు ఏ హామీ ఇవ్వలేదు. కడుపునిండా 'సవేరా' విందారగించి , చల్లగా జారుకున్నారు.

## కోడూరులో జాగృతి

తోటపల్లిగూడూరు మండలం కోడూరులో జాగృతి స్వచ్ఛంద సంస్థ ఆధ్వర్యంలోని అనియత విద్యాకేంద్రం సమావేశం 30తేది జరిగింది. ప్రాజెక్టు ఆఫీసర్ శ్రీ శేషయ్య, శ్రీ రామకృష్ణ, శ్రీ పల్లూరు మాధవరావు , సిండికేట్ బ్యాంకు ఉద్యోగి శ్రీ చిట్టిబాబు , శ్రీ నీలం సీతారామయ్య, శ్రీవి.మోహన్‌రెడ్డి, శ్రీకాటంరెడ్డి కిశోర్ రెడ్డి, శ్రీ వెంకటేశ్వర్లు, గులాంబాష, నిర్మల, లక్ష్మి తదితరులు సమావేశంలో పాల్గొన్నారు.

## కావలి యువ త్రయానికి సన్మానం

కేంద్ర ఫిలిం సెన్సార్ బోర్డు సభ్యులుగా నియమితులైన శ్రీ వెంకటేశ్వర్లు చౌదరి, రైల్వేబోర్డు సభ్యులైన శ్రీఎం.గోవిందరెడ్డి, మాజీ మునిసిపల్ వైస్‌ఛైర్మన్ శ్రీ గ్రంధి యానాదిశెట్టిలను కావలి కృష్ణ అభిమానుల సంఘం 2తేది ఘనంగా సన్మానించింది. సభను శ్రీ నారెళ్ల అల్లూరయ్య అధ్యక్షించారు.సభలో, పాత్రికేయుడు శ్రీ ఎస్ జయప్రతాప రెడ్డి ప్రచురించి, వెంకటేశ్వర్లుచౌదరికి అంకితమిచ్చిన ' చిత్తూరు' జిల్లాలో తొలి స్వాతంత్ర్య పోరాటం 'అనే చిన్న పుస్తకాన్ని శ్రీకేసరి సుందర రామశర్మ ఆవిష్కరించారు. ఈ గ్రంథరచయిత డాక్టర్ దేవిరెడ్డి సుబ్రహ్మణ్యంరెడ్డి.

యువత్రయం ముగ్గురూ తమ రాజకీయ ప్రాభవానికి కారకులైన ఎమ్మెల్యే శ్రీ యనాది రెడ్డికి కృతజ్ఞతలు చెప్పుకున్నారు. పూలమాలలు, ప్రశంసా పత్రాలు, పొగడ్తలు జోరుగా వుండినాయి.

# వెయ్యిమంది విద్యార్థులకు ముగ్గురు టీచర్లు

# రాపూరు స్కూలు దీనావస్థ!

రాపూరు జూనియర్ కాలేజి హైస్కూలు దీనావస్థ గురించి వింటుంటే పల్లెటూళ్లలో విద్యా సంస్థలు 21 శతాబ్దానికైనా బాగుపడతాయా అన్న సందేహం కలుగుతుంది. కాలేజీకి అనుబంధంగా వున్నస్కూలిది. 1100 మంది విద్యార్థు లున్నారు. కానీ టీచర్ల సంఖ్య మాత్రం మూడంటే మూడు. అందులోనూ బిఇడి టీచర్లు ఇద్దరే; మూడవ ఉపాధ్యాయుడు సెకండరీ గ్రేడ్ అట. వెయ్యికి మించిన విద్యార్థులకు ముగ్గురు టీచర్లు ఏమి పాఠం చెప్తారు? ఎన్ని సబ్జెకులు చెప్తారు? పరీక్షలు ఎట్లా వ్రాయిస్తారు? 8,9,10 తరగతుల్లోనే విద్యార్థుల సంఖ్య 750 అట. ఇది చాలక ఈ ఏడాది కలెక్టరు గారు కలిచేడు, ఊటుకూరు, తలుపూరు హైస్కూళ్ల నుంచి హరిజన, గిరిజన విద్యార్థులను రాపూరు హాస్టలుకు మార్పించారు. వారందరికీ ఈ స్కూలులోనే సీట్లు ఇవ్వాలి. చదువు చెప్పే సంగతి దేవుడెరుగు , ఇన్ని వందల మంది విద్యార్థులను ఒకచోట కూలేసి, అటెండెన్సు వేసుకోవడానికి కూడా ఇప్పుడున్న అయ్యవార్లు చాలరు.

విద్యార్థుల సంఖ్య ప్రకారం దీనికి కనీసం 18మంది టీచర్లు కావాలి. కాని అన్ని పోస్టులే లేవిక్కడ. వున్న వాటిలో ఐదు ఖాళీ; రాపూరుకు వచ్చి పని చేయడానికి అయ్యవార్లకు కష్టం. అందువల్ల ఇక్కడ నియమింపబడిన వారు కూడా పలుకుబడితో బదలీ చేయించుకొని వెళ్ళిపోతున్నారు. అధికార్లకు ఈ సంగతి తెలుసు. కాని అడిగేవారెవరూ లేనపుడు వారికేమి పట్టుంది? రాపూరు నుంచి ఒక్క నాయకుడూ కలెక్టరును కలిసి పరిస్థితి వివరించినట్లు కన్పడదు. చెప్తె కనీసం వున్న పోస్టుకైనా టీచర్లను వేస్తారు కదా?

పిల్లకాయలు దిక్కు ముఖాలేసుకొని అయ్యవార్లకోసం ఎదురు చూస్తూ కూర్చుంటున్నారు. వారు స్కూలుకు వచ్చారా లేదా అని విచారించేవారు , చదువు చెప్పే వారు లేరు. మారిపోదామనుకొంటే వేరే స్కూలు లేదు. కలెక్టరు గారు ఈ దీనావస్థను గమనించి, కనీసం 10మంది అయ్యవార్లనైనా రాపూరుకు పంపకుంటే ఇక్కడ స్కూలు నడపడమే దండగ.

# మైపాడ్ బీచ్‌లో అంతటి దుర్మార్గాలేమీ లేవు

కడప జిల్లా యాత్రికులపై దాడి తర్వాత మైపాడు బీచ్‌పై వస్తున్న వార్తలు, వదంతులు ఆందోళన కల్గిస్తున్నాయి. జిల్లాలో వున్న ఒకే ఒక సముద్ర తీర విహారయాత్రా స్థలం పట్ల చెడు అభిప్రాయం కల్గించే రీతిలో వున్నాయి. ఈ వార్తల ధోరణి మరీ విడ్డూరంగా వుంది. మైపాడు బీచ్‌లో ఆడ మనిషి కన్పడితే మైనపడి పాడు చేసేస్తారన్న భయాన్ని కల్గిస్తున్నాయి. ఒక మైనర్ బాలికను రేప్ చేశారని; దంపతులు విహారానికివస్తె భర్త ఎదుటే భార్యను చెరిచారని; చంపి, పాతిపెట్టారని; కాలేజి విద్యార్థినులను సామూహికంగా మానభంగం చేశారని దినపత్రికలు వార్తలు ప్రచురిస్తున్నాయి. అయితే ఆ సంఘటనలు జరిగినట్లు ఏ ఆధారాలూ లేవు. కట్టు కథలు, గాలి కబుర్ల ప్రచారంతో బంగారు వంటి బీచ్‌ను బీడుపెట్టిస్తున్నారు.

మైపాడు బీచ్ దగ్గర పట్టపు వాళ్లు నివాసముంటున్న మాట నిజమే కాని, వారు విహార యాత్రికులపై కామాంధుల వలె విరుచుక పడుతున్నారన్నది అన్యాయపు ఆరోపణ. ఎక్కడో, ఎప్పుడో పోకిరి చేష్టలు జరిగి వుండవచ్చు కాని రేప్‌లు, హత్యలు జరిగేంత దుర్మార్గ పరిస్థితులు అక్కడ నెలకొని లేవు.

విడబ్ల్యుడి, సమాచార శాఖ అతిథిగృహాలు రెండూ పాడుపడిన తర్వాత మైపాడు సముద్ర తీరానికి రాకపోకలే తగ్గిపోయాయి. మంచినీటి వసతికూడా లేకపోవడంతో, ఎవరికీ అక్కడికి పోవాలన్న ఉత్సాహం లేదు. ఈ పరిస్థితులలో ఆ తీరంలో విహారం ప్రాణాపాయం అన్న దుష్ప్రచారం జరిగితే, మైపాడును జిల్లావాసులు పూర్తిగా మర్చిపోయే ప్రమాదం ఏర్పడుతుంది.



జమీన్‌రైతు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ. 100.00 |
| ఆరు నెలలకు | రూ. 50.00 |
| విడి ప్రతి | రూ. 2.00 |

జననం :17-7-1963
మరణం : 23-7-1992

బలీయమైన విధికి తలవంచి తేది23-7-1992 హఠా న్మరణం చెందిన నాజ్యేష్ఠ కుమారుడు

**కుడుముల కరుణ కుమార్**

మృతి సంఘటనతో దుఃఖ సాగరంలో యున్న మా కుటుంబ సభ్యులకు సానుభూతి, సంతాపములు తెలిపిన పెద్దలకు, అధికార, అనధికార ప్రముఖులకు, బంధు మిత్రులకు మా కృతజ్ఞతలు తెలుపు కొనుచున్నాము. నా కుమార్తె కుమారి కుడుముల పద్మశ్రీ (నెల్లూరు పార్లమెంటు సభ్యురాలు) కి తేది 7-8-92 జరుపవలసిన వివాహ కార్యక్రమము విరమించు కొన్నాము. బంధుమిత్రులు తెలియ గోరుతాము.

తండ్రి కుడుముల వీరయ్య

తల్లి కుడుముల తిరుపతమ్మ

కుమారి పద్మశ్రీ ఎం.పి.(అక్క) విజయకుమార్, రవికుమార్, సంజయ్‌కుమార్.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET printing at Nayagara